బమ్మెఱ పోతనామాత్య ప్రణీత

తెలుగు భాగవత మహాపురాణాంతర్గత

# శ్రీకృష్ణులవారు అవతరించుట

సంకలనం

భాగవత గణనాధ్యాయి



సౌజన్యం: **telugubhagavtam.org**

**2022 - శ్రావణ మాసం**

ఓం సహనావవతు! సహనౌభునక్తు!

సహవీర్యం కరవావహై!

తేజస్వి నావధీతమస్తు! మా విద్విషా వహై!

ఓం శాంతిః శాంతిః శాంతిః!!

ఈశ్వరుడు మనల నిరువురిని రక్షించుగాక! మనల నిరువురను పోషించుగాక! మనము గొప్ప శక్తితో (దివ్యబలముతో) కలసి పని చేయుదుముగాక! అధ్యయనముచే మనమిఋవురము మేధా సంపదను పొందుదుముగాక! మన మొండొరులను ద్వేషింపకుందుముగాక! శాంతి, శాంతి, శాంతి సర్వత్రా వుండుగాక!

# విషయానుక్రమణిక

# ప్రాస్తావన

సకల అవతారలలో శ్రీమన్నారాయణమూర్తి సంపూర్ణ అంశతో కూడినది శ్రీకృష్ణావతారం. అట్టి శ్రీకృష్ణ తత్వాన్ని సంపూర్ణగా ఆవిష్కరించినది శ్రీమద్భాగవత మహాపురాణము నందు. ఇందు జాతీయ మహాకవి సహజపాండిత్య ప్రవీణులు అయిన మన బమ్మెఱ పోతనామాత్యువారి రచనా వైశిష్ట్య విశ్వరూపం ఆవిష్కరింపబడింది. మధురభక్తి సామ్రాజ్యానికి పెట్టింది పేరు కదండి. భక్తి భావనలు వర్ణించే అవకాశం వచ్చినప్పుడంతా తన తేనెలో ముంచిన గంటంతో మధురత్వం అంతా జాలువారుస్తారు.

శైశవ కృష్ణునికి జోలపాడడం. స్నానంచేయిచడం నుండి శైశవవేడుకలు జరిపించుకోవడం; హరిహరాభేదం చూపడం. వెన్నదొంగ అల్లరి చెప్పడం. కళింది మర్ధన, గిరిధారణ, అబ్బో ఇలా ఎన్నెన్నో కృష్ణలీలలతో మైమరపిస్తుంటాడు. ఎదురుగా మెలగుతున్నట్లే ఉంటాడు. అంతలో మాయలో పడేస్తాడు. మళ్ళా ఆ మధురస్మృతులు వెన్నంటే ఉంటాయి. అటువంటి మాయా మానవ బాలకుడు అవతరించడం ఆ లీలలు పరమాద్భుతం. అప్పటి లీలలు అవీ ఎంత లాలిత్యంగా ఉంటాయో అంతర్లీనంగా అత్యంత రహస్యమైన వేదాతసారాలు అలవోకగా నడుస్తూ ఉంటాయి.

కన్నతల్లిదండ్రులకు పెళ్ళై ఇంటికి వెళ్తున్నారు. ఇంతలోనే ఆకాశవాణి పలకడం కంసునిలో రాక్షసప్రవృత్తి పేట్రేగడం. తనకు ముందు ఆదిశేషుడు అవతరించాలి. ఇదో నాటకీయతలో పరాకాష్ఠ. మాయాదేవిని పిలిచి ఆమెచేత, దేవకీదేవి గర్భంలోని పిండాన్ని రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టాడు. ఆ మాయను తను పెరగదల్చున్న నందాంగన కడుపున పుట్టమనడం. ఆ శిశివు ఇటు వ్రేపల్లెకు. ఈ శిశువు అటు మధురలోని జైలుకు. తారుమారు కావడం. అదీ అష్టమినాటి అర్థరాత్రిట. మధ్యలో యమునానది ఉంది కదా సందేహించకండి. ఆమె చీలి దారిచ్చిందిట ఆ కొద్దిసేపు. ఐనా జగన్నాటక సూత్రధారికి ఇదెంత పని. బ్రహ్మదేవుడు, వసుదేవుడు, దేవకీదేవి అందరూ నవజాత శిశివును కీర్తించినవారే.

ఇంతటి అద్భుతమైన ఉపాఖ్యానం సాధన మన మిప్పుడు చేసుకుందాం తరిద్దాం.

భాగవత గణనాధ్యాయి

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీకృష్ణులు అవతరించుట

## ప్రార్థన

10.1-1-క.

శ్రీకంఠచాప ఖండన!

పాకారిప్రముఖ వినుత భండన! విలస

త్కాకుత్థ్సవంశమండన!

రాకేందు యశోవిశాల! రామనృపాలా!

టీక:- శ్రీకంఠచాపఖండన = శ్రీరామ {శ్రీకంఠ చాప ఖండనుడు - శ్రీకంఠుని (శోభాకర కంఠుడు యైన శివుని) చాప (విల్లును) ఖండనుడు (విరిచినవాడు), రాముడు}; పాకారిప్రముఖ వినుత భండన = శ్రీరామ {పాకారి ప్రముఖ వినుత భండనుడు - (పాకాసురుని శత్రువైన ఇంద్రుడు) మున్నగువారి చేత వినుత (పొగడబడిన) భండన (యుద్ధము కలవాడు), రాముడు}; విలసత్కాకుత్థ్స వంశ మండన = శ్రీరామ {విలసత్కాకుత్థ్స వంశ మండనుడు - విలసత్ (ప్రసిద్ధి కెక్కిన) కాకుత్థ్సవంశ (కకుత్థ్స మహరాజ వంశమునకు) మండనుడు (అలంకారమైనవాడు), రాముడు}; రాకేందు యశోవిశాల = శ్రీరామ {రాకేందు యశోవిశాలుడు - రాకేందు (నిండు పున్నమి చంద్రుని) వంటి యశః (కీర్తి) విశాలుడు (విరివిగా కలవాడు), రాముడు}; రామ = రాముడు అనెడి {నిండుపున్నమి చంద్రుని పదహారు కళలు - 1అమృత 2మానద 3పూష 4తుష్టి 5పుష్టి 6రతి 7ధృతి 8శశిని 9చంద్రిక 10కాంతి 11జ్యోత్స్న 12శ్రీ 13ప్రీతి 14అంగద 15పూర్ణ 16పూర్ణామృత}; నృపాల = రాజా.

భావము:- శ్రీరామచంద్ర ప్రభు! నీవు క్షీరసాగరమథన సమయంలో పుట్టిన హాలాహలమును కంఠమున ధరించుట ద్వారా లోకాలు సమస్తమునకు శోభను అనుగ్రహించిన శివుని ధనుస్సు విరిచిన మొనగాడవు. ఇంద్రుడు మొదలైన దేవతలు సైతం కీర్తించేలా యుద్ధం చేసిన వాడవు. ప్రసిద్ధమైన కాకుత్థ్స వంశానికి అలంకారమైన వాడవు. నిండు పదహారు కళల పూర్ణచంద్రుని లాంటి కీర్తి మెండుగా వ్యాపించిన వాడవు. ప్రజలకి ఆనందం పంచే మహారాజువి.

## రోహిణి బలభద్రుని కనుట

10.1-62-తే.

దేవకీదేవికడుపులోఁ దేజరిల్లు
దీప్త గర్భంబు మెల్లనఁ దిగిచి యోగ
నిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ;
గడుపు దిగె నంచుఁ బౌరులు గలగఁ బడగ.

టీక:- దేవకీ = దేవకీ అనెడి; దేవి = ఉత్తమురాలు; కడుపు = గర్భము; లోన్ = అందు; తేజరిల్లు = ప్రకాశించెడి; దీప్త = కాంతివంతమైన; గర్భంబున్ = పిండమును; మెల్లనన్ = మృదువుగా; తిగిచి = వెలువరించి; యోగనిద్ర = యోగమాయ; రోహిణి = రోహిణి యొక్క; కడుపునన్ = గర్భమునందు; నిలిపి = స్థిరపరచి; చనియెన్ = వెళ్ళిపోయెను; కడుపు = గర్భము; దిగెను = జారిపోయెను; అంచున్ = అనుచు; పౌరులు = పురజనులు; కలగన్ = కలత; పడగ = చెందగా.

భావము:- యోగనిద్రాదేవి, కాంతులు చిమ్ముతున్న దేవకీదేవి కడుపులో ఉన్న గర్భాన్ని నెమ్మదిగా బయటకు తీసి రోహిణీదేవి కడుపులో ప్రవేశపెట్టి వెళ్ళిపోయింది. దేవకీదేవికి గర్భస్రావం జరిగిపోయిందని పౌరులు బాధపడ్డారు.

10.1-63-వ.

అంత.

టీక:- అంత = అంతట.

భావము:- కొన్ని నెలలకు. .

10.1-64-ఆ.

బలము మిగులఁ గలుగ "బలభద్రుఁ"డన లోక
రమణుఁ డగుటఁ జేసి "రాముఁ"డనగ
సతికిఁ బుట్టె గర్భసంకర్షణమున "సం
కర్షణుం"డనంగ ఘనుఁడు సుతుఁడు.

టీక:- బలము = జ్ఞానైశ్వర్య ధైర్య శారీరక శక్తి; మిగులన్ = అధికముగ; కలుగన్ = కలిగి ఉండుటచేత; బలభద్రుడు = బలభద్రుడు; అనన్ = అని పిలవబడుతు; లోక = సమస్త లోకములకు; రమణుడు = సంతోషింపజేయువాడు; అగుటన్ = అగుట; చేసి = వలన; రాముడు = రాముడు; అనగన్ = అని పిలవబడుతు; సతి = ఇల్లాలు (రోహిణి); కిన్ = కి, అందు; పుట్టెన్ = జన్మించెను, అవతరించె; గర్భ = పిండమును; సంకర్షణమునన్ = మార్పిడి చేయబడుట చేత; సంకర్షణుండు = సంకర్షణుడు; అనగన్ = అని పిలవబడెడి; ఘనుడు = గొప్పవాడు; సుతుడు = పుత్రుడు.

భావము:- రోహిణిగర్భాన చాలా గొప్పవాడు అయిన ఒక కుమారుడు పుట్టాడు. గర్భాన్ని బయటకు లాగడం ద్వారా పుట్టినవాడు కనుక సంకర్షణుడు అనీ, చాలా బలవంతుడు కావడం వలన బలభద్రుడు అనీ, అందరిని ఆనందింపచేసేవాడు కనుక రాముడు అనీ అతనికి పేర్లు వచ్చాయి.

10.1-65-వ.

తదనంతరంబ.

టీక:- తదనంతంబ = ఆ తరువాత.

భావము:- పిమ్మట. . .

10.1-66-క.

ఆనకదుందుభి మనమున
శ్రీనాథుం డంశభాగశిష్టతఁ జొరఁగన్
భానురుచి నతఁడు వెలిఁగెను
గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా!

టీక:- ఆనకదుందుభి = వసుదేవుడు; మనమునన్ = మనసునందు; శ్రీనాథుండు = విష్ణుమూర్తి యొక్క {శ్రీనాథుడు - శ్రీ (చిచ్ఛక్తి యైన లక్ష్మీదేవి)కి నాథుడు (భర్త), విష్ణువు}; అంశ = కళ యందలి; భాగ = భాగముచేత; శిష్టతన్ = శ్రేష్ఠత్వము; చొరగన్ = చేరుటచేత; భాను =సూర్యుని బోలు; రుచిన్ = కాంతితో; అతడు = అతను; వెలిగెనున్ = ప్రకాశించెను; కానగన్ = చూచుటకు; పట్టయ్యెన్ = నివాసభూతుడయ్యెను; భూత = జీవుల, పంచభూతము {పంచభూతములు - 1భూమి 2జలము 3అగ్ని 4వాయువు 5ఆకాశము}; గణముల్ = సమూహముల; కున్ = కు; నృపా = రాజా {నృపుడు - నరులను పాలించువాడు, రాజు}.

భావము:- శ్రీదేవికి భర్త అయిన విష్ణుదేవుని అంశ వసుదేవునిలో ప్రవేశించడంతో అతడు సూర్యకాంతితో ప్రకాశించాడు. పంచభూతాలకూ జీవులకూకూడా అది చూసి ఆనందం కలిగింది.

10.1-67-ఉ.

ఆ వసుదేవుఁ డంతఁ దన యం దఖిలాత్మక మాత్మ భూతముం
బావనరేఖయున్ భువనభద్రమునై వెలుఁగొందుచున్న ల
క్ష్మీవిభు తేజ మచ్చుపడఁ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో
దేవకి యొప్పెఁ బూర్వయగు దిక్సతి చంద్రునిఁ దాల్చు కైవడిన్."

టీక:- ఆ = ఆ; వసుదేవుడు = వసుదేవుడు; అంత = అంతట; తన = అతని; అందున్ = శరీరములోపల; అఖిల = సమస్తము నందు; ఆత్మకమున్ = ఆత్మ ఐనది; ఆత్మభూతమున్ = పరమాత్మ ఐనది; పావనరేఖయున్ = నిత్యపవిత్రమైనది; భువన = సర్వలోకములకు; భద్రమున్ = శుభకరము ఐనది; ఐ = అయ్యి; వెలుగొందుచున్న = ప్రకాశించుచున్న; లక్ష్మీవిభు = విష్ణుమూర్తి యొక్క; తేజమున్ = వీర్యమున్; అచ్చుపడన్ = అచ్చొత్తినట్లేర్పడగా; చేర్చినన్ = ప్రవేశపెట్టగా; తాల్చి = ధరించి; నవీన = సరికొత్త; కాంతి = తేజస్సు; తోన్ = తోటి; దేవకి = దేవకీదేవి; ఒప్పెన్ = చక్కగా ఉండెను; పూర్వ = తూర్పుది; అగు = ఐన; దిక్ = దిక్కు అనెడి; సతి = ఇల్లాలు; చంద్రునినన్ = చంద్రుడిని; తాల్చు = ధరించెడి; కైవడిన్ = విధముగ.

భావము:- అలా తనలో విష్ణుతేజం ప్రవేశించిన వసుదేవుడు, ఆ తేజాన్ని దేవకీదేవి యందు ప్రవేశపెట్టాడు. ఆ విష్ణుతేజస్సు సృష్టి అంతా నిండి ఉండేది. అన్నిటికి ఆత్మ అయినది. లోకాలను పునీతం చేయగలది. లోకాలు అన్నిటికి క్షేమం చేకూర్చేది. లక్ష్మీపతి అయిన విష్ణువుని యొక్క తేజస్సు అది. ఆ తేజస్సు చక్కగా తనలో ప్రవేశించడంతో, దేవకీదేవి కొత్త కాంతితో ప్రకాశించింది. తూర్పుదిక్కు అనే స్త్రీ చంద్రోదయానికి ముందు చంద్రునికాంతితో నిండిపోయినట్లు, దేవకీదేవి దేదీప్యమానంగా ప్రకాశించింది."

10.1-68-వ.

అనిన విని తర్వాతి వృత్తాంతం బెట్లయ్యె నని రా జడిగిన శుకుం డిట్లనియె.

టీక:- అనినన్ = అనగా; విని = విని; తర్వాతి = ఆ తరువాత జరిగిన; వృత్తాంతంబున్ = విషయములు; ఎట్లు = ఏ విధముగ; అయ్యెన్ = జరిగినవి; అని = అన; రాజు = రాజు (పరీక్షిత్తు); అడిగినన్ = అడుగగా; శుకుండు = శుకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను;

భావము:- అలా శుకముని చెప్పగా విన్న పరీక్షుత్తు కుతూహలంతో "ఆ తరువాత ఏమి జరిగింది." అని అడిగాడు. అందుకు ఆయన ఇలా చెప్పసాగాడు.

10.1-69-క.

"గురుతరముగఁ దన కడుపునఁ

సరసిజగర్భాండభాండ చయములు గల యా

హరి దేవకి కడుపున భూ

భరణార్థము వృద్ధిఁబొందె బాలార్కు క్రియన్.

టీక:- గురుతరముగన్ = మిక్కిలి గొప్పగ {గురుతనము - గురుతరము - గురుతమము}; తన = తన యొక్క; కడుపునన్ = గర్భము నందు; సరసిజగర్భాండ = బ్రహ్మాండముల; భాండ = భాండముల; చయములు = అనేకములు; కల = కలిగి ఉన్న; ఆ = ఆ; హరి = విష్ణుమూర్తి; దేవకి = దేవకీదేవి; కడుపునన్ = గర్భము నందు; భూ = భూమిని; భరణ = సంరక్షణ; అర్థమున్ = కొరకు; వృద్ధిన్ = పెరుగుటను; పొందెన్ = పొందెను; బాల = లేత; అర్కు = సూర్యుని; క్రియన్ = వలె.

భావము:- ఎంతో బరువైన బ్రహ్మాండ భాండాలెన్నో తన కడుపులో దాచుకున్న విష్ణువు భూమిని ఉద్ధరించడానికి దేవకీదేవి కడుపులో ఉదయసూర్యునిలాగ వృద్ధిపొందాడు.

10.1-70-వ.

అంత.

టీక:- అంత = అప్పుడు.

భావము:- అలా భగవదవతారాన్ని దేవకీదేవి గర్భంలో దాచుకున్న ఆ సమయంలో . .

10.1-71-సీ.

విమతులమోములు వెలవెలఁ బాఱంగ-
విమలాస్యమోము వెల్వెలకఁ బాఱె;
మలయు వైరులకీర్తి మాసి నల్లనగాఁగ-
నాతిచూచుకములు నల్లనయ్యె;
దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట-
లేమ యారున రోమలేఖ మెఱసె;
నరి మానసముల కాహారవాంఛలు దప్ప-
వనజాక్షి కాహారవాంఛ దప్పె;

10.1-71.1-తే.

శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర
జడత వాటిల్లె శత్రులు జడను పడఁగ;
మన్ను రుచియయ్యెఁ బగతురు మన్ను చొరఁగ;
వెలఁది యుదరంబులో హరి వృద్ధిఁబొంద.

టీక:- విమతుల = కంస చాణూరాదుల {విమతులు - శత్రువులు, కంసాదులు}; మోములున్ = ముఖములు; వెలవెలబాఱంగ = కాంతివిహీనములుకాగ; విమలాస్య = స్త్రీ {విమలాస్య - తేటయైన అస్య (మోముగలామె), సుందరి}; మోము = ముఖము; వెల్వెలక = కాంతివిహీనత్వము; పాఱెన్ = పోయినది; మలయు = వ్యాపించుచున్న; వైరుల = శత్రువుల యొక్క; కీర్తి = యశస్సు; మాసి = కాంతిచెడి; నల్లనన్ = నల్లగా, నశించినది; కాగన్ = అయిపోగా; నాతి = స్త్రీ; చూచుకములు = స్తనాగ్రములు; నల్లనన్ = నల్లగా; అయ్యెన్ = అయినవి; దుష్ట = దుష్టుల యొక్క; ఆలయంబులన్ = ఆవాసములందు; ధూమ = పొగ; రేఖలు = చుట్టలు; పుట్టన్ = లేచుచుండగ; లేమ = స్త్రీ; ఆరునన్ = నూగారునందు; రోమ = వెంట్రుకల; లేఖ = వరుసలు; మెఱసెన్ = ప్రకాశించినవి; అరి = శత్రువుల యొక్క; మానసముల్ = మనసుల; కున్ = కు; ఆహారవాంఛలున్ = ఆకళ్ళు; తప్పన్ = లేకపోతుండగా; వనజాక్షి = స్త్రీ {వనజాక్షి - తామరలవంటి కన్నులుగలామె, స్త్రీ}; కిన్ = కి; ఆహార = తిన; వాంఛ = బుద్ధి; తప్పెన్ = కాకపోతుండెను.

శ్రమమున్ = బడలికలు; సంధిల్లెన్ = కలిగెను; రిపుల్ = శత్రువుల; కున్ = కు; శ్రమమున్ = బడలిక; కదురన్ = కలుగుతుండగ; జడత = బుద్ధిమాంధ్యము; వాటిల్లెన్ = సంభవించినది; శత్రులు = శత్రువులు; జడను = స్తబ్దత్వము; పడగన్ = కలుగగా; మన్ను = మట్టిపై; రుచి = ఇష్టము; అయ్యెన్ = కలిగెను; పగతురు = శత్రువులు; మన్ను = మట్టిలో; చొరగన్ = కలసిపోవుటకు; వెలది = స్త్రీ; ఉదరంబున్ = కడుపు; లోన్ = అందు; హరి = విష్ణుమూర్తి; వృద్ధిపొందెన్ = పెరిగెను.

భావము:- దేవకీదేవికి గర్భవతులైన స్త్రీలకు ఉండే లక్షణాలు కనిపించసాగాయి. స్వచ్ఛమైన ఆమె ముఖము తెల్లపడుతుండగా, దుర్మార్గుల ముఖాలు వెలవెలపోడం మొదలయింది. ఆమె చనుమొనలు నల్లపడుతుండగా, శత్రువుల కీర్తులు మాసిపోయి నల్లబడడం ప్రారంభమైంది. ఆమె పొత్తికడుపుపై నూగారు మెరుస్తుండగా, దుష్టుల ఇండ్లలో అపశకునాలైన ధూమరేఖలు పుట్టాయి. ఆమెకు ఆహారంపై కోరిక తప్పుతుండగా, శత్రువులకు బెంగతో ఆహారం హితవు అవటం మానివేసింది. ఆమెకు బద్ధకము కలుగుతూంటే, శత్రువులకు తెలియని అలసట మొదలైంది. శత్రువులు మట్టికరచే స్థితి వస్తూ ఉన్నట్లు, ఆమెకు మట్టి అంటే రుచి ఎక్కువ అయింది. ఇలా దేవకీదేవి కడుపులో విష్ణువు క్రమక్రమంగా వృద్ధిచెందసాగాడు.

10.1-72-వ.

మఱియును.

టీక:- మఱియునున్ = ఇంకను.

భావము:- ఇంకనూ. . .

10.1-73-సీ.

సలిల మా యెలనాఁగ జఠరార్భకునిఁ గానఁ-
  జనిన కైవడి ఘర్మసలిల మొప్పె;
నోగిఁ దేజ మా యింతి యుదరడింభకు గొల్వఁ-
  గదిసిన క్రియ దేహకాంతి మెఱసెఁ;

బవనుఁ డా కొమ్మ గర్భస్థుని సేవింప-
   నొలసెనా మిక్కిలి యూర్పు లమరెఁ;
గుంభిని యా లేమ కుక్షిగు నర్చింపఁ-
   జొచ్చుభంగిని మంటి చొరవ దనరె;

10.1-73.1-ఆ.

గగన మిందువదనకడుపులో బాలు సే
వలకు రూపు మెఱసి వచ్చినట్లు
బయలువంటి నడుము బహుళ మయ్యెను; బంచ
భూతమయుఁడు లోనఁ బొదల సతికి.

టీక:- సలిలము = నీరు; ఆ = ఆ; ఎలనాగ = స్త్రీ {ఎలనాగ - యౌవనమున ఉన్నామె, పడతి}; జఠర = గర్భస్తుడైన; అర్భకునిన్ = పిల్లవానిని; కానన్ = దర్శించుకొనుటకై; చనిన = వెళ్ళిన; కైవడిన్ = విధముగ; ఘర్మ = చెమట; సలిలము = నీరు; ఒప్పెను = ఒప్పియున్నది; ఒగిన్ = క్రమముగ; తేజమున్ = తేజస్సు; ఆ = ఆ; ఇంతి = స్త్రీ; ఉదరడింభకున్ = కడుపులోని పిల్లవానిని; కొల్వ = సేవించుకొనుటకు; కదిసిన = చేరిన; క్రియన్ = విధముగ; దేహ = శరీరపు; కాంతి = ప్రకాశము; మెఱసెన్ = మెరుపులుపొందెను; పవనుడు = వాయువు; ఆ = ఆ; కొమ్మన్ = పడతి యొక్క; గర్భస్థుని = కడుపులో నున్నవాని; సేవింపన్ = కొలచుటకు; ఒలసెన్ = ప్రసరించేనా; ఆ = అన్నట్లుగ; మిక్కిలి = అధికముగ; ఉర్పులు = నిట్టూర్పులు; అమరెన్ = ఒప్పెను; కుంభిని = భూమి; ఆ = ఆ; లేమ = స్త్రీ; కుక్షిగున = కడుపులో నున్నవాని; అర్చింపన్ = సేవించుటకు; చొచ్చు = ప్రవేశించెడి; భంగినిన్ = విధముగ; మంటి = మన్నుతినుట యందు; చొరవ = ఆసక్తి; తనరె = అతిశయించెను.
గగనము = ఆకాశము; ఇందువదన = చంద్రముఖి; కడుపు = గర్భము; లోన్ = లోపల; బాలున్ = పిల్లవాని; సేవల్ = కొలచుటకి; కున్ = కు; రూపు = ఆకృతి; మెఱసెన్ = అతిశయించి; వచ్చిన = వచ్చిన; అట్లు = విధముగా; బయలు = ఆకాశము, అతిసన్ననైన; వంటి = వంటిదైన; నడుము = నడుము; బహుళ = లావెక్కినది; అయ్యెన్ = అయినది; పంచభూత = పంచమహాభూతములు; మయుడు = తానైనవాడు; లోనన్ = లోపల; పొదలన్ = వృద్ధిచెందగా; సతి = ఇల్లాలు; కిన్ = కు.

భావము:- పంచభూతాత్మకుడు అయిన విష్ణుమూర్తి దేవకి గర్భంలో పెరుగుతూ ఉండటంతో. పంచభూతాలలో జలములు ఆ గర్భస్థ బాలుడిని చూడడానికి వెళ్ళాయా అన్నట్లు, ఆమెకు చెమటలు

పోయడం మొదలెట్టాయి; అగ్ని ఆ కడుపులోని పాపడిని సేవించడానికి వచ్చినట్లు, ఆమె శరీరం కాంతితో మెరిసింది; ఆ గర్భస్తుడైన శిశువును వాయుదేవుడు సేవించబోయినట్లు, ఆమెకు నిట్టూర్పులు ఎక్కువ అయ్యాయి; భూమి ఆ కడుపులోని పిల్లాడిని పూజించడానికి వెళ్ళిందా అన్నట్లు, దేవకీదేవికి మన్నుపై ప్రీతి ఎక్కువైంది; గర్భంలో ఉన్న శిశువును సేవించడానికి అకాశం రూపం ధరించి వచ్చిందా అన్నట్లు, కనుపించని ఆమె నడుము విశాలమైంది.

10.1-74-వ.

తదనంతరంబ.

టీక:- తదనంతరంబ = ఆ తరువాత.

భావము:- అటుపిమ్మట . . . .

10.1-75-సీ.

అతివకాంచీగుణం బల్లన బిగియంగ-
  వైరివధూ గుణవ్రజము వదలె;
మెల్లన తన్వంగి మెయిదీవ మెఱుఁగెక్క-
  దుష్టాంగనాతనుద్యుతు లడంగె;
నాతి కల్లన భూషణములు పల్పలనగాఁ-
  బరసతీభూషణ పంక్తు లెడలె;
గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డుగాఁ-
  బరిపంథిదారగర్భములు పగిలెఁ;

10.1-75.1-తే.

బొలఁతి కల్లన నీళ్ళాడు ప్రొద్దు లెదుగ
నహితవల్లభ లైదువలై తనర్చు
ప్రొద్దు లన్నియుఁ గ్రమమున బోవఁ దొడగెఁ;
నువిదకడుపున నసురారి యుంటఁజేసి.

టీక:- అతివ = స్త్రీ; కాంచీ = మొలనూలు; గుణంబున్ = పోగులు; అల్లన = క్రమముగా; బిగియంగన్ = బిగిసిపోతుండగా; వైరి = శత్రువుల; వధూ = భార్యల; గుణ = మంగళసూత్రముల; వ్రజమున్ = సమూహము; వదలెన్ = సడలినవి; మెల్లనన్ = క్రమముగా; తన్వంగి = సుందరి {తన్వంగి - సన్నని దేహము గలామె, స్త్రీ}; మెయి = దేహము అనెడి; తీవ = తీగ; మెఱుగెక్కన్ = మెరుపుపొందగా; దుష్ట = దుష్టుల యొక్క; అంగనా = భార్యల; తను = శరీరపు; ద్యుతులు = కాంతులు; అడంగెన్ = అణగిపోయెను; నాతి = స్త్రీ; కిన్ = కి; అల్లన = మెల్లగ; భూషణములున్ = ఆభరణములు; పల్చలన = విరళములు; కాన్ = కాగా; పర = శత్రుల; సతి = భార్యల; భూషణ = ఆభరణముల; పంక్తులు = పేర్లు, వరుసలు; ఎడలెన్ = వీడిపోయెను; కలకంఠి = స్త్రీ {కలకంఠి - కోయిలవంటి కంఠముగలామె, స్త్రీ}; కిన్ = కి; ఒయ్యనన్ = క్రమముగా; గర్భంబున్ = కడుపు; దొడ్డ = పెద్ది; కాన్ = అగుతుండగ; పరిపంథి = శత్రువుల; దార = భార్యల; గర్భములున్ = గర్భస్థపిండములు; పగిలెన్ = బద్దలైపోయినవి; పొలతి = సుందరి; కిన్ = కి; అల్లనన్ = క్రమముగ.
నీళ్ళాడు = ప్రసవపు; ప్రొద్దులు = దినములు; ఎదుగన్ = దగ్గరౌతుండగా; అహిత = పగవారి; వల్లభల = భార్యలు; ఐదువలు = పునిస్త్రీలు; ఐ = అయ్యి; తనర్చు = అతిశయించెడి; ప్రొద్దులు = దినములు; అన్నియున = అన్ని; క్రమముననన్ = వరుసగా; పోవ = గడచిపోవ; తొడగెన్ = సాగెను; ఉవిద = స్త్రీ; కడుపుననన్ = గర్భములో; అసురారి = విష్ణుమూర్తి {అసురారి - అసుర (రాక్షసులకు) అరి (శత్రువు), విష్ణువు}; ఉంటన్ = ఉండుటచేత; చేసి = వలన.

భావము:- దేవకీదేవి గర్భాన రాక్షసులను సంహరించే విష్ణువు ఉండడం చేత; ఆమెకు మొలనూలు నెమ్మదిగా బిగిసిపోతూ ఉంటే, శత్రువుల భార్యల మంగళ సూత్రాల త్రాళ్ళు జారిపోసాగాయి; తన శరీరకాంతి హెచ్చుతూ ఉండగా, పగవారి భార్యల శరీర కాంతులు మాసిపోసాగాయి; ఆమెకు ఆభరణాలు బరువు అనిపిస్తుండగా, శత్రుభార్యల కడుపులు జారిపోసాగాయి; ఆమెకు ప్రసవించే దినాలు దగ్గరవుతున్నకొద్దీ శత్రువుల భార్యలు ముత్తైదువలుగా ఉండే దినాలు తరిగిపోసాగాయి.

10.1-76-వ.

ఇవ్విధంబున.

టీక:- ఈ = ఈ; విధంబునన్ = విధముగ.

భావము:- ఈవిధంగా లోకాలన్నింటినీ కడుపులో దాచుకున్న విష్ణువును తన గర్భంలో ఇలా మోస్తూ. .

10.1-77-ఆ.

జ్ఞానఖలునిలోని శారదయును బోలె
ఘటములోని దీపకళిక బోలె
భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకీ
కాంత విశ్వగర్భగర్భ యగుచు.

టీక:- జ్ఞానఖలుని = జ్ఞానరహితుని; లోని = అందలి; శారదయునున్ = చదువు; పోలెన్ = వలె; ఘటము = కుండ; లోని = లోపల ఉంచబడిన; దీప = దీపపు; కళిక = శిఖ; పోలెన్ = వలె; భ్రాత = సోదరుని; ఇంటన్ = నివాసమునందు; ఆకన్ = చెఱసాలలో; పడి ఉండెన్ = పడి ఉండెను; దేవకీకాంత = దేవకీదేవి; విశ్వగర్భ = విష్ణువు {విశ్వగర్భుడు - పద్నాలుగు లోకములు ఉదరమున కలవాడు, విష్ణువు}; గర్భ = గర్భమున కలామె; అగుచున్ = అగుచు.

భావము:- అజ్ఞాని నోట సరస్వతి వలె, కుండ లోపల పెట్టిన దీపకణికలాగ దేవకీదేవి అన్నగారి ఇంట్లో బంధించబడి ఉంది. అలా నిర్బంధంలో అణగిమణిగి ఉండిపోయింది.

10.1-78-వ.

అంత న క్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును, మేనిమెఱుంగును, మెలంగెడి సొబగునుం జూచి వెఱఁగుపడి తఱచు వెఱచుచుఁ గంసుండు తనలో నిట్లనియె.

టీక:- అంతన్ = అప్పుడు; ఆ = ఆ; కాంతా = స్త్రీలలో; తిలకంబున్ = శ్రేష్ఠురాలు; నెఱ = నిండైన; మొగంబున్ = ముఖము నందు; తెలివియునున్ = తేజస్సు; మేని = దేహపు; మెఱుంగును = కాంతి; మెలంగెడి = నడయాడుట యందలి; సొబగున్ = చందమును; చూచి = కనుగొని; వెఱగుపడి = ఆశ్చర్యపోయి; తఱచున్ = అధికముగ; వెఱచుచున్ = బెదురుతూ; కంసుండు = కంసుడు; తన = అతని మనసు; లోన్ = లోపల; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అంతకంతకూ అతిశయిస్తున్న ఆమె ముఖంలోని కాంతిని శరీరపు మెరుపునూ అందాన్ని చూసి కంసుడు నిశ్చేష్టుడు అవుతున్నాడు. అస్తమానూ భయపడుతూ తనలోతను ఇలా అనుకోసాగాడు.

10.1-79-క.

"కన్నులకుఁ జూడ బరువై
యున్నది యెలనాఁగగర్భ ముల్లము గలగన్
ము న్నెన్నఁడు నిట్లుండదు
వెన్నుఁడు చొరఁ బోలు గర్భవివరములోనన్.

టీక:- కన్నులన్ = కళ్ళతో; చూడన్ = చూచుటకు; బరువు = భారముగ ఉన్నది; ఐ = అయ్యి; ఉన్నది = ఉన్నది; ఎలనాగ = స్త్రీ యొక్క; గర్భమున్ = గర్భము; ఉల్లము = మనసు; కలగన్ = కలత చెందునట్లుగ; మున్ను = ఇంతకు పూర్వము; ఎన్నడున్ = ఎప్పుడు కూడ; ఇట్లు = ఈ విధముగ; ఉండదు = లేదు; వెన్నుడు = విష్ణువు; చొరన్ = ప్రవేశించుటచేత; పోలున్ = కాబోలు; గర్భవివరము = గర్భాశయము; లోనన్ = లోపల.

భావము:- "ఈమె గర్భం చూస్తూ ఉంటే, నా గుండె బరువెక్కుతోంది. మనస్సు కలవరపడుతోంది. ఇంతకు ముందు ఏ గర్భాన్ని చూసినా ఇలా అవ్వ లేదు. ఈ గర్భంలో విష్ణువు ప్రవేశించి ఉండవచ్చు.

10.1-80-ఉ.

ఏమి దలంచువాఁడ? నిఁక నెయ్యది కార్యము? నాఁడునాఁటికిం
గామిని చూలు పెంపెసఁగె; గర్భిణిఁ జెల్లెలి నాఁడు పేద నే
నేమని చంపువాడఁ? దగ వేలని చంపితినేని శ్రీయు ను
ద్దామయశంబు నాయువును ధర్మమునుం జెడిపోవ కుండునే?

టీక:- ఏమి = ఎట్టి; తలచువాడను = ఆలోచనచేయను; ఇక = ఇకపైన; ఎయ్యది = ఏది; కార్యము = చేయదగినపని; నాడునాటికిన్ = నానాటికి; కామిని = పడతి {కామిని -కామము కలామె, స్త్రీ}; చూలు = గర్భము; పెంపెసగెన్ = మిక్కిలి వృద్ధిచెందినది; గర్భిణిన్ = కడుపుతో ఉన్నామెను; చెల్లెలిన్ = చిన్నసోదరిని; ఆడుపేదన్ = పాపం ఆడపిల్లని; నేన్ = నేను; ఏమి = ఎందుకు; అని = అని; చంపువాడన్ = సంహరించను; తగవు = గొడవ; ఏలన్ = ఎందుకని; చంపితిని = వధించితిని; ఏని = ఐనచో; శ్రీయును = ఐశ్వర్యము; ఉద్దామ = గొప్ప; యశంబున్ = కీర్తి; ఆయువున్ = ఆయుష్షు; ధర్మమునున్ = ధర్మములు; చెడిపోవకన్ = క్షీణించకుండగ; ఉండునే = ఉండునా, ఉండవు.

భావము:- ఇప్పుడు నేనేమి మంత్రాంగం ఆలోచించాలి? ఏమి తంత్రం చేయాలి? రోజురోజుకీ ఈమె గర్భం కాంతిమంతం అవుతూ ఉంది? ఇటు చూస్తే ఈమె ఆడకూతురు గర్భవతి చెల్లెలూ కదా ఎట్లా చంపేది? ఎందుకు వచ్చిన గొడవ అని చంపానంటే, నా ఐశ్వర్యం, ఆయువు, కీర్తి, ధర్మం అన్నీ నాశనమైపోవా?

10.1-81-క.

వావి యెఱుంగని క్రూరుని
జీవన్మృతుఁ డనుచు నిందఁ జేయుదు; రతడుం
బోవును నరకమునకు; దు
ర్భావముతో బ్రదుకు టొక్క బ్రదుకే తలఁపన్?"

టీక:- వావి = బంధుత్వపు వరుసను; ఎఱుంగని = తెలిసికొనలేని; క్రూరుని = కఠినుని; జీవన్మృతుడు = ప్రాణమున్న శవము; అనుచున్ = అని; నింద = దూషణలు (లోకులు); చేయుదురు = చేసెదరు; అతడున్ = అతను కూడ; పోవును = పోవును; నరకమున్ = నరక లోకమున; కున్ = కు; దుర్భావము = చెడ్డవాడు అనిపించుకొనుట; తోన్ = తోటి; బ్రతుకుట = జీవించుట; ఒక్క = అదికూడ ఒక; బ్రదుకే = జీవితమా, కాదు; తలపన్ = తరచి చూసినచో.

భావము:- "వావివరుసలు చూడని క్రూరుడు బ్రతికి ఉన్నా చచ్చిన వాడే" అని నిందిస్తారు లోకులు అలాంటి వాడు నరకానికి పోతాడు. దుష్టుడనే పేరుతో బ్రతకడం కూడా ఒక బ్రతుకేనా?"

10.1-82-వ.

అని నిశ్చయించి క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించుకొనుచు, దిగ్గనం జెలియలిం జంపు నగ్గలిక యొగ్గని యుగ్గడించి మాని, మౌనియుం బోలెనూర కుండియు.

టీక:- అని = అని; నిశ్చయించుకొని = నిర్ణయించుకొని; క్రౌర్యంబున్ = క్రూరత్వమును; విడిచి = విడనాడి; ధైర్యంబున్ = ధైర్యమును; ఒంది = తెచ్చుకొని; గాంభీర్యంబున్ = గాంభీర్యమును; పాటించి = వహించి; శౌర్యంబున్ = పరాక్రమమును; ప్రకటించుకొనుచు = చూపుతూ; దిగ్గనన్ = చటుక్కున; చెలియలిన్ = చెల్లెలిని;

చంపున్ = వధించెడి; అగ్గలిక = పూనిక; ఎగ్గు = కీడు; అని = అని; ఉగ్గడించి = గట్టిగా చెప్పుకొని; మాని = విడిచిపెట్టి; మౌనియున్ = మౌనవ్రతధారి; పోలెన్ = వలె; ఊరకుండియు = ఊరుకొన్నప్పటికి;

భావము:- ఇలా అని ఆలోచించి నిశ్చయించుకుని, క్రౌర్యం మాని, ధైర్యం తెచ్చుకొనిస గాంభీర్యం పైపైన పులుముకుని, శూరునిలా ప్రవర్తించాడు. “చెల్లెలిని చంపడం మహా పాపం” అని గట్టిగా భావించాడు. ఆతర్వాత ఏమీ మాట్లాడకుండా మౌనిలాగ శాంతస్వభావం ప్రకటిస్తూ ఉండిపోయాడు.

10.1-83-ఆ.

పాపరాని దొడ్డ పగపుట్టె నిక నెట్టు
లిందుముఖికిఁ జక్రి యెపుడు పుట్టుఁ?
బుట్టినపుడె పట్టి పురిటింటిలోఁ దెగఁ
జూతు ననుచు నెదురుచూచుచుండె.

టీక:- పాపరాని = అణచుకోలేని; దొడ్డ = పెద్ద; పగన్ = పగ; పుట్టెన్ = జనించినది; ఇక = ఇకపైన; ఎట్టుల = ఎలా; ఇందుముఖి = సౌందర్యవతి {ఇందుముఖి - చంద్రుని వంటిమోము గలామె, స్త్రీ}; చక్రి = మహావిష్ణువు; ఎపుడు = ఎప్పుడు; పుట్టున్ = ప్రసవించును; పుట్టినప్పుడె = ప్రసవించగానె; పట్టి = పట్టుకొని; పురిటింటి = ప్రసవము జరిపెడి గది; లోన్ = అందే; తెగజూతున్ = వధించెదను; అనుచున్ = అంటూ; ఎదురుచూచుచుండె = ఎదురుచూస్తుండెను;

భావము:- అయినా లోలోపల మాత్రం కంసుడు భయపడుతూనే ఉన్నాడు. “తప్పించుకోలే నంతటి గొప్ప శత్రుత్వం పుట్టుకు వచ్చింది. ఇంకెలాగ? ఈమెకు విష్ణువు ఎప్పుడు పుడతాడో? ఏమిటో? పుట్టగానే పురిటింట్లోనే వాడిని పట్టుకుని చంపేస్తాను.” అంటూ దేవకి ప్రసవించే సమయంకోసం ఎదురుచూడసాగాడు.

10.1-84-వ.

మఱియు వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి యతండు.

టీక:- మఱియున్ = ఇంకను; వైర = శత్రుత్వపు; అనుబంధము = బంధుత్వముతో; అన్య = ఇతరమైన; అనుసంధానమున్ = దృష్టిపెట్టుట; మఱచి = చేయలేకుండగ; అతండు = అతను.

భావము:- విష్ణువుతో సంభవించిన శత్రుత్వం కారణంగా, కంసుడు విష్ణువు తప్ప ఇతర విషయాలు సమస్తం మరచిపోయాడు.

10.1-85-క.

తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు

నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్

హరిఁ దలఁచితలఁచి జగ మా

హరిమయ మని చూచెఁ గంసుఁ డాఅని యలుకన్.

టీక:- తిరుగుచున్ = ప్రవర్తిల్లుచు; కుడుచుచున్ = తింటు; త్రావుచున్ = తాగుతూ; అరుగున్ = నడచుచు; కూర్చుండి = ఆసీనుడు అయ్యి; లేచుచు = పైకి లేస్తూ; అనవరతంబున్ = ఎల్లప్పుడు; హరిన్ = విష్ణుమూర్తిని; తలచితలచి = మిక్కిలి మననము చేసి; జగము = భువనమంతా; హరి = విష్ణు; మయము = నిండినది; అని = అని; చూచెన్ = భావించసాగెను; కంసుడు = కంసుడ; ఆఅని = ఉపశమింపని; అలుకన్ = పగతో.

భావము:- తిరుగుతున్నా, భోజనంచేస్తున్నా, త్రాగుతున్నా, నడుస్తున్నా, కూర్చున్నా, లేచినా, ఎప్పుడూ విష్ణువునే స్మరించసాగాడు. క్రోధంతో వేడెక్కిపోయి లోకమంతా విష్ణుమయంగానే దర్శించసాగాడు.

10.1-86-వ.

వెండియు.

టీక:- వెండియున్ = ఇంకను.

భావము:- ఇంకా కంసుడి పరిస్థితి ఎలా ఉంది అంటే. .

10.1-87-సీ.

శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు-

నది హరిరవ మని యాలకించు;
నక్షిమార్గమున నెయ్యది చూడఁబడు నది-
హరిమూర్తి గానోపు నంచుఁ జూచుఁ;
దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన-
హరికరాఘాతమో యనుచుఁ నులుకు;
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన-
హరిమాలికాగంధ మనుచు నదరుఁ;

10.1-87.1-తే.

బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు
పలుకఁబడియె ననుచు బ్రమసి పలుకుఁ;
దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు
హరితలంపు లనుచు నలుఁగఁ దలఁచు.

టీక:- శ్రవణ = చెవుల; రంధ్రములన్ = కన్నములందు; ఏ = ఏ విధమైన; శబ్దంబున్ = చప్పుడు; వినబడున్ = వినబడినను; అది = అది; హరి = విష్ణువు యొక్క; రవము = పలుకు; అని = అని; ఆలకించున్ = వినును; అక్షి = కంటికి; మార్గమునన్ = ఎదురుగా; ఎయ్యది = ఏదైతే; చూడబడున్ = కనబడుతుందో; అది = దానిని; హరి = విష్ణువు యొక్క; మూర్తి = స్వరూపము; కానోపున్ = అయ్యుండవచ్చును; అంచున్ = అనుచు; చూచున్ = అనుకొనును; తిరుగుచోన్ = నడయాడెడి యప్పుడు; దేహంబున్ = శరీరమును; తృణము = గడ్డిపరక; ఐనన్ = అయినను; సోకినన్ = తగిలినచో; హరి = విష్ణువు యొక్క; కర = చేతి; ఘాతము = దెబ్బేమో; అనుచున్ = అనుచు; ఉలుకున్ = ఉలికిపడును; గంధంబులు = వాసనలు; ఏమైనన్ = ఏవైనసరే; ఘ్రాణంబున్ = ముక్కుకు; సోకినన్ = తగిలినచో; హరి = విష్ణువు యొక్క; మాలికా = పూలహారముల; గంధము = వాసనలు; అనుచున్ = అనుచు; అదరున్ = ఉలికిపడును; పలుకులు = మాటలు; ఎవ్వియైనన్ = ఏవైనాసరే; పలుకుచోన్ = మాట్లాడినచో. హరి = విష్ణువు యొక్క; పేరు = నామము; పలుకబడియెన్ = ఉచ్చరించిరి; అనుచున్ = అనుచు; భ్రమసి = భ్రమపడి; పలుకున్ = మాటలనుచుండును; తలపులు = ఆలోచనలు; ఎట్టివి = ఎలాంటివి; ఐనన్ = అయినప్పటికి; తలచి = తలచుకొని; ఆ = ఆ; తలపులు = ఆలోచనలు; హరి = విష్ణువు యొక్క; తలంపులు = ఆలోచనలు; అనుచున్ = అనుచు; అలగన్ = కోపగించవలెనని; తలచు = అనుకొనును.

భావము:- చెవులకు ఏ శబ్దం వినబడినా అది విష్ణువు మాటేనని వింటూ ఉన్నాడు. కనులకి ఏది కనిపించినా అది విష్ణుదేవుడి రూపమేనని చూస్తున్నాడు. శరీరానికి గడ్డిపరక తగిలినా విష్ణుని చేయి తగిలిందేమోనని ఉలుక్కిపడుతూ ఉన్నాడు. ముక్కుకు ఏవాసన సోకినా అది విష్ణువు మెడలోని వనమాలిక వాసనేమోనని అదిరిపడుతున్నాడు. తాను ఏ మాట ఉచ్చరించినా విష్ణువు పేరు పలికానేమోనని భ్రమపడి విష్ణువు పేరే పలుకుతున్నాడు. ఎటువంటి ఆలోచనలు వచ్చినా అవి విష్ణువును గురించిన ఆలోచనలేమోనని ఆగ్రహం తెచ్చుకుంటున్నాడు.

## బ్రహ్మాదుల స్తుతి

10.1-88-వ.

అ య్యవసరంబున ననుచరసమేతులైన దేవతలును, నారదాది మునులునుం గూడ నడువ నలువయును, ముక్కంటియు నక్కడకు వచ్చి దేవకీదేవి గర్భంబున నర్భకుండై యున్న పురుషోత్తము నిట్లని స్తుతియించిరి.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయము నందు; అనుచర = పరివారముతో; సమేతులు = కూడినవారు; ఐనన్ = అయినట్టి; దేవతలునున్ = దేవతలు; నారద = నారదుడు; ఆది = మున్నగు; మునులునున్ = ఋషులు; కూడనడువ = వెంటరాగా; నలువయునున్ = చతుర్ముఖబ్రహ్మ {నలువ - నలు (నాలుగు, 4) వ (ముఖముల వాడు), బ్రహ్మ}; ముక్కంటియున్ = పరమశివుడు {ముక్కంటి - మూడు కన్నులు కలవాడు, శివుడు}; అక్కడ = ఆ స్థలమున; కున్ = కు; వచ్చి = వచ్చి; దేవకీ = దేవకి అనెడి; దేవి = ఉత్తమురాలి; గర్భంబునన్ = కడుపులో ఉన్న; అర్భకుండు = పిల్లవాడు; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; పురుషోత్తమునిన్ = విష్ణుమూర్తిని; ఇట్లు = ఈ విధముగ; అని = అని; స్తుతియించిరి = కీర్తించిరి.

భావము:- మధురలో పరిస్థితి ఇలా ఉండగా బ్రహ్మదేవుడు, పరమ శివుడు అనుచరులు, దేవతలు, నారదాది మునులు వెంటరాగా దేవకీదేవి బంధింపబడి ఉన్న కారాగారం దగ్గరకు వచ్చారు. ఆమె గర్భంలో శిశువుగా ఉన్న పురుషోత్తముడైన విష్ణువును ఈవిధంగా స్తోత్రం చేసారు.

10.1-89-సీ.

"సత్యవ్రతుని నిత్యసంప్రాప్త సాధనుఁ-

కాలత్రయమునందు గలుగువాని
భూతంబు లైదును బుట్టుచోటగు వాని-
నైదుభూతంబులం దమరువాని
నైదుభూతంబులు నడఁగిన పిమ్మట-
బరఁగువానిని సత్యభాషణంబు
సమదర్శనంబును జరిపెడువానిని-
ని న్నాశ్రయింతుము; నీ యధీన

10.1-89.1-ఆ.

మాయచేత నెఱుకమాలిన వారలు
పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు;
రెఱుగనేర్చు విబుధు లేకచిత్తంబున
నిఖలమూర్తు లెల్ల నీవ యండ్రు.

టీక:- సత్య = సత్యమును; వ్రతుని = నడపుటే దీక్షగా గలవానిని; నిత్య = శాశ్వతమైన మోక్షమును; సంప్రాప్త = పొందుటకు; సాధనున్ = ఉపకరణమైనవానిని; కాలత్రయమున్ = త్రికాలముల {త్రికాలములు -1భూత 2భవిష్యత్ 3వర్తమానకాలములు}; అందున్ = లోను; కలుగు = ఉండెడి; వానిన్ = అతనిని; భూతంబులైదును = పంచమహాభూతములు {పంచభూతములు - 1భూమి 2నీరు 3నిప్పు 4గాలి 5ఆకాశము}; పుట్టు = ఉత్పత్తి అయ్యెడి; చోటు = స్థానము; అగు = అయిన; వానిన్ = అతనిని; ఐదుభూతములు = పంచభూతముల; అందున్ = లోను; అమరు = ఉండెడి; వానిన్ = అతనిని; ఐదుభూతములున్ = పంచభూతములు; అడగినన్ = అణగిపోయిన; పిమ్మటన్ = తరువాతకూడ; పరగు = ఉండు; వానినిన్ = అతనిని; సత్య = నిజమునే; భాషణంబు = చెప్పుట; సమదర్శనంబును = సమదృష్టి; జరిపెడు = నడపెడు; వానినిన్ = అతనిని; నిన్నున్ = నిన్ను; ఆశ్రయింతుము = శరణుజొత్తుము; నీ = నీకు; అధీన = లోబడి యున్న.

మాయ = మాయాశక్తి; చేతన్ = వలన; ఎఱుకమాలిన = నష్టజ్ఞానులైన; వారలు = వారు; పెక్కు = అనేకమైన; గతులన్ = విధములుగ; నిన్నున్ = నిన్ను; పేరుకొందురు = చెప్పుతుంటారు; ఎఱుక = జ్ఞానము; నేర్చు = సంపాదించిన; విబుధులు = జ్ఞానులు; ఏక = ఏకాగ్రతగల; చిత్తంబునన్ = మనసునందు; నిఖిల = సమస్తమైన; మూర్తులన్ = రూపములను; ఎల్లన్ = అన్నిటిని; నీవ = నీవే; అండ్రు = అంటారు.

భావము:- “మహానుభావా! నీవు సత్యమే వ్రతంగా కలవాడవు; నిత్యత్వం అనే యోగసిద్ధి ప్రాప్తించడానికి నీవే ఆధారం; జరిగినది జరుగుతున్నది జరుగబోయేది అయిన కాలములలో నీవు ఉంటూ ఉంటావు; భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే అయిదు భూతాలూ నీయందే జన్మిస్తున్నాయి; అ ఐదు భూతాలలోనూ నీవే నిండి ఉన్నావు; పంచభూతాలూ ప్రళయంలో అణిగి పోయిన తర్వాత కూడా నీవు ఉంటూ ఉంటావు; సృష్టిలో ఉన్న సత్యమనేదే నీవాక్కు; అన్నిటిని సమానంగా చూడడం అనేది నీవే నిర్వహిస్తూంటావు; అటువంటి నీవే దిక్కని నిన్ను ఆశ్రయిస్తున్నాము; మాయ అనేది నీ అధీనంలో ఉంటుంది; ఆమాయచేత జ్ఞానం కప్పబడి అజ్ఞానం ఆవరించినవారు నీయందు భేదభావం వహించి ఉంటారు; కాని జ్ఞానులైన పండితులు మాత్రం ఒకే మనస్సుతో అలోచించి ఈ సమస్తమైన రూపములు నీవే అంటారు.

10.1-90-వ.

అదియునుం గాక.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- అంతే కాకుండా

10.1-91-సీ.

ప్రకృతి యొక్కటి పాదు; ఫలములు సుఖదుఃఖ-

ములు రెండు; గుణములు మూఁడు వేళ్ళు;

తగు రసంబులు నాల్గు ధర్మార్థ ముఖరంబు-

లెఱిగెడి విధములై దింద్రియంబు;

లాఱు స్వభావంబు లా శోక మోహాదు-

లూర్ములు; ధాతువులొక్క యేడు;

పైపొరలెనిమిది ప్రంగలు; భూతంబు-

లైదు బుద్ధియు మనోహంకృతులును;

10.1-91.1-తే.

రంధ్రములు తొమ్మిదియుఁ గోటరములు; ప్రాణ

పత్త్రదశకంబు; జీవేశ పక్షియుగముఁ

గలుగు సంసారవృక్షంబు గలుగఁ జేయఁ

గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ.

టీక:- ప్రకృతి = ప్రకృతి; ఒక్కటి = ఒకానొకటి; పాదు = చెట్టు; ఫలములు = పండ్లు; సుఖ = సుఖములు; దుఃఖములున్ = దుఃఖములు అనెడివి; రెండు = రెండు (2); గుణములు = త్రిగుణములు {త్రిగుణములు - సత్త్వరజస్తమోగుణములు మూడు}; మూడున్ = మూడు (3); వేళ్ళు = మూలములు; తగు = తగినవి; రసంబులు = రుచులు; నాల్గున్ = నాలుగు (4) {రుచులు నాలుగు — తీపి, పులుపు, కారము, చేదు.}; ధర్మ = ధర్మము; అర్థ = అర్థము; ముఖరంబులు = మున్నగునవి; ఎఱింగెడి = విషయములను తెలుసుకొనెడి; విధములు = రకములు; ఐదింద్రియములు = జ్ఞానేంద్రియములు {పంచజ్ఞానేంద్రియములు - 1కన్ను 2ముక్కు 3నాలుక 4చెవి 5చర్మము}; ఆఱు = ఆరు (6); స్వభావంబులన్ = స్వభావములు; ఆ = ఆ; శోక = శోకము {షడూర్ముల - 1ఆశన 2పిపాస 3శోక 4మోహ 5జరా 6మరణములు}; మోహ = మోహము; ఆదులున్ = మున్నగుని; ఊర్ములు = వంకరలు; ధాతువులు = సప్తధాతులు {సప్తధాతువులు - 1త్వక్ (చర్మము) 2మాంస (మాంసము) 3రుధిర (రక్తము) 4మేధో (మెదడు) 5మజ్జ (మూలుగ) 6అస్థి (ఎముకలు) 7శుక్లములు (వీర్యము)}; ఒక్క = ఒకానొక; ఏడు = ఏడు (7); పైపొరలు = పైపొరలు; ఎనిమిది = ఎనిమిదైనవి (8) {అష్టావరణలు - 1. పృథివి, 2. అప్పు, 3, తేజము, 4. వాయువు, 5. ఆకాశము, 6, అహంకారము, 7. మహత్తత్వము, 8. ప్రకృతి.}; ప్రంగలు = కొమ్మలు; భూతంబులు = పంచభూతముల; ఐదున్ = అయిదు(5); బుద్ధియు = బుద్ధి; మనస్ = మనస్సు; అహంకృతులును = అహంకారములు.

రంధ్రములుతొమ్మిదియున్ = నవరంధ్రములు {నవరంధ్రములు - కళ్ళు రెండు (2) ముక్కురంధ్రములు (2) నోరు (1) చెవులు (2) రహస్యావయవము (1) గుదము(1)}; కోటఱములు = చెట్టు తొఱ్ఱలు; ప్రాణ = దశప్రాణములు {ప్రాణదశకములు - 1ప్రాణము 2అపానము 3వ్యాన 4ఉదాన 5సమాన 6నాగ 7కూర్మ 8కృకర 9దేవదత్త 10ధనంజయములు}; పత్త్ర = ఆకులు; దశకంబున్ = పది (10); జీవ = జీవాత్మ; ఈశ = పరమాత్మ అనెడి; పక్షి = పక్షుల; యుగమున్ = జంట; కలుగున్ = కలిగుండును; సంసార = సంసారము అనెడి; వృక్షంబున్ = వృక్షమునకు; కలుగజేయ = సృష్టి; కావ = స్థితి; అడగింప = లయములుకలిగించుటకు; రాజవు = ప్రభువువు;

ఒక్కరుండవు = ఒకడివే; ఈవ = నీవే.

భావము:- జీవులందరికీ ఈశ్వరుడవు నీవు. ఈ సృష్టిలో సంసారం అనే వృక్షం ఒకటుంది. 1) దానికి ప్రకృతి పాదు. 2) సుఖదుఃఖాలనేవి రెండూ ఫలాలు. 3) సత్త్వరజస్తమస్సు అనే గుణాలు మూడూ దానికి వేళ్ళు. 4) ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ అనే నాలుగు పురుషార్థాలూ రసాలు. 5) దానికి శబ్దం, స్పర్శం, రూపం, రుచి, వాసన అనే ఐదూ ఇంద్రియాలు గ్రహించే విధానాలు. 6) కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అనే ఆరూ స్వభావాలూ 7) ఆరు ఊర్ములు ఆకలి, దప్పిక, శోకమూ, మోహమూ, ముసలితనమూ, మరణమూ అనేవి. 8) రసం, రక్తం, మాంసం, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్రము అనే ఏడు ధాతువులూ ఆ వృక్షానికి గల ఏడు పొరలు అయి ఉంటాయి. ఇంత తెలిసి తొట్రుపాటు పడడమెందుకు. 9) పంచభూతాలు, బుద్ధి, మనస్సు, అహంకారం అనే ఎనిమిది ఆ వృక్షానికి కొమ్మలు. 10) కన్నులు, చెవులు, ముక్కుపుటాలు, నోరు, మల మూత్రాద్వారాలు అనే తొమ్మిదీ ఆ వృక్షానికి గల తొమ్మిది రంధ్రాలు. 11) ప్రాణమూ, అపానమూ, వ్యానమూ, ఉదానమూ, సమానమూ అనే పంచప్రాణాలూ నాగమూ, కూర్మమూ, కృకరమూ, దేవదత్తము, ధనంజయం అనే ఐదు ఉపప్రాణాలు మొత్తం పది ప్రాణాలు అనే ఆకులు ధరించి ఉంటుంది ఆ సంసార వృక్షం. 12) జీవుడు ఈశ్వరుడు అనే రెండు పక్షులు ఆవృక్షంపై నివసిస్తుంటాయి. ఇటువంటి అద్భుతమైన సంసార వృక్షాన్ని పుట్టించడానికి రక్షించడానికీ మళ్లీ లయం చేయడానికీ ప్రభువా! నీవు ఒక్కడివే

10.1-92-క.

నీదెసఁ దమచిత్తము లిడి

యే దెసలకుఁ బోక గడతు రెఱుక గలుగువా;

రా దూడయడుగు క్రియ నీ

పాదం బను నావకతన భవసాగరమున్.

టీక:- నీ = నీ; దెసన్ = అందే; తమ = వారి యొక్క; చిత్తములు = మనస్సులను; ఇడి = నిలిపి; ఏ = ఏ ఇతరమైన; దెసలు = మార్గముల; కున్ = కు; పోక = వెళ్ళకుండగ; గడతురు = జీవితము గడిపెదరు; ఎఱుక = బ్రహ్మజ్ఞానము; కలుగు = ఉన్న; వారు = వారు; ఆ = ఆ; దూడ = ఆవుదూడ యొక్క; అడుగు = అడుగును; క్రియన్ = వలె; నీ = నీ యొక్క; పాదంబు = పాదములు; అను = అనెడి; నావ = తెప్ప; కతన = కారణముచేత; భవ = సంసారము అనెడి; సాగరమున్ = సముద్రమును.

భావము:- పరమ జ్ఞానులు తమ మనస్సును ఏవైపునకూ పోనీయకుండా నీయందే నిలుపుతారు. అందువలన వారు నీపాదమనే తెప్ప ఆధారంతో భయంకరమైన సంసార మహాసముద్రాన్ని దాటతారు. అది కూడా ఆవుదూడ అడుగును దాటినంత తేలికగా దాటగలుగుతారు.

10.1-93-ఆ.

మంచివారి కెల్ల మంగళ ప్రద లయ్యుఁ
గల్లరులకు మేలుగాని యట్టి
తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు
సేమ మెల్లప్రొద్దు జేయు దీవు.

టీక:- మంచివారి = సజ్జనుల; కిన్ = కి; ఎల్లన్ = అందరకు; మంగళ = శుభ; ప్రదలు = కలిగించెడివి; అయ్యున్ = ఐనను; కల్లరులు = దుష్టుల; కున్ = కు; మేలు = శుభకరములు; కాని = కాని; అట్టి = అటువంటి; తనువులు = జన్మములు; ఎన్ని = ఎన్ని; ఐనన్ = ఐనను; తాల్చి = ధరించి; లోకముల్ = భువనముల; కున్ = కు; సేమమున్ = క్షేమములు; ఎల్లన్ = సర్వ; ప్రొద్దున్ = కాలము లందును; చేయుదువు = చేసెదవు; ఈవు = నీవు.

భావము:- నీవు నిత్యమూ ఎన్ని శరీరాలలో అయినా అవతరిస్తావు. అలా అసంఖ్యాకమైన అవతారాలు ధరిస్తూ లోకాలకు క్షేమం కలుగజేస్తూ ఉంటావు. ఆయా శరీరాలతో నీవు మంచివారికి అందరికి శుభములు చేకూరుస్తూ; దుష్టులకు శిక్షలు విధిస్తూ ఉంటావు.

10.1-94-క.

ఎఱిఁగినవారల మనుచును
గొఱమాలిన యెఱుక లెఱిఁగి కొందఱు నీ పే
రెఱిగియు దలఁపగ నొల్లరు
పఱతు రధోగతుల జూడఁ బద్మదళాక్షా!

టీక:- ఎఱిగిన = తత్త్వము తెలిసిన; వారలము = వారము; అనుచున్ = అనుచు; కొఱమాలిన = పనికిమాలిన; ఎఱుకలు = జ్ఞానములు; ఎఱిగి = తెలిసికొని; కొందఱు = కొంతమంది; నీ = నీ యొక్క; పేరు = గొప్పదనము, నామము; ఎఱిగియున్ = తెలిసినప్పటికిని; తలపగన్ = మననము చేయుటకు; ఒల్లరు =

అంగీకరింపరు; పఱతురు = పడిపోయెదరు; అధోగతుల = నీచ జన్మముల; జాడన్ = మార్గము నందు; పద్మదళాక్ష = విష్ణుమూర్తి {పద్మదళాక్షుడు - తామర రేకుల వంటి కన్నులు కలవాడు, విష్ణువు}.

భావము:- హరీ! కొందరు జ్ఞానులము అనుకుంటూ దుష్టులై పనికిమాలిన తెలివి తేటలతో నీ నామసంకీర్తన చేయరు. నీ నామసంకీర్తనం నిజంగా జ్ఞానులైన వారిని రక్షిస్తుంది అని తెలిసినా నీ నామం మననం చేయకుండా పోయి పోయి అధోగతుల పాలవుతారు.

10.1-95-క.

నీ వారై నీ దెసఁ దమ

భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై

యే విఘ్నంబులఁ జెందక

నీ వఱలెడి మేటిచోట నెగడుదు రీశా!

టీక:- నీ = నీకు చెందిన; వారు = వారు; ఐ = అయ్యి; నీ = నీ; దెసన్ = అందు; తమ = వారి యొక్క; భావంబులున్ = ధ్యానములు; నిలిపి = చేర్చి; ఘనులు = గొప్పవారు; భయ = భయములు; విరహితుల్ = లేనివారు; ఐ = అయ్యి; ఏ = ఎట్టి; విఘ్నంబులన్ = ఆటంకములను; చెందక = లెక్కించక; నీవు = నీవు; అరలెడి = వ్యాపించి ఉండెడి; మేటి = గొప్ప; చోటన్ = స్థానము నందు; నెగడుదురు = అతిశయించెదరు; ఈశా = నారాయణా {ఈశుడు - సృష్టి స్థితి లయములు చేయగల ప్రభువు, విష్ణుమూర్తి}.

భావము:- నిజంగా గొప్పవారైనవారు తమ సొంతం అంటూ ఏమీలేకుండా నీ వారుగా ఉంటారు. నీ యందే తమ భావాలను నిలిపి ఉంచడం వలన భయం అనేది వారికి ఉండదు. నీ యందు హృదయాలు నిలిపి ఉంచడం వలన విఘ్నాలేవీ వారిని చేరవు. నీవు ఎక్కడ ఉంటావో ఆదివ్యలోకంలోనే వారు నివసిస్తారు.

10.1-96-క.

నిను నాలుగాశ్రమంబుల

జనములు సేవింప నఖిల జగముల సత్త్వం

బును శుద్ధంబును శ్రేయం

బును నగు గాత్రంబు నీవు పొందుదువు హరీ!

టీక:- నినున్ = నిన్ను; నాలుగాశ్రమంబుల = చతురాశ్రమముల {చతురాశ్రమములు - 1బ్రహ్మచర్యము 2గార్హస్థ్యము 3వానప్రస్థము 4సన్యాసము అనెడి నాలుగు ఆశ్రమములు}; జనములున్ = ప్రజలును; సేవింపన్ = కొలచుచుండగా; అఖిల = సమస్తమైన; జగముల = లోకాలకు; సత్త్వంబును = సత్వగుణములు కలది; శుద్ధంబును = స్వచ్ఛమైనది; శ్రేయంబున్ = మోక్షమును; అగు = కలిగించెడిది ఐన; గాత్రంబున్ = దేహమును; నీవున్ = నీవే అయ్యి (కైవల్యము); పొందుదువు = పొందెదవు; హరీ = విష్ణుమూర్తి.

భావము:- బ్రహ్మచారులు గృహస్థులు వానప్రస్థులు సన్యాసులు అనే నాలుగు ఆశ్రమాల ప్రజలూ నిన్ను సేవిస్తూ ఉంటారు. అన్ని లోకాలలోనూ సత్త్వమయమైనది, పరిశుద్ధమైనదీ, క్షేమము చేకూర్చేది అయిన దేహాన్ని నీవు పొందుతుంటావు.

10.1-97-సీ.

నలినాక్ష! సత్త్వగుణంబు నీ గాత్రంబు-

గాదేని విజ్ఞానకలిత మగుచు

నజ్ఞానభేదకం బగు టెట్లు? గుణముల-

యందును వెలుఁగ నీ వనుమతింపఁ

బడుదువు; సత్త్వరూపంబు సేవింపంగ-

సాక్షాత్కరింతువు సాక్షి వగుచు

వాఙ్మనసముల కవ్వలిదైన మార్గంబు-

గలుగు; నీ గుణజన్మకర్మరహిత

10.1-97.1-తే.

మైన రూపును బేరు నత్యనఘబుద్ధు

లెఱుగుదురు; నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు
వినుచుఁ దలచుచుఁ బొగడుచు వెలయువాఁడు
భవము నొందఁడు నీ పాద భక్తుఁడగును.

టీక:– నలినాక్ష = హరి {నలినాక్షుడు - నలినము (పద్మముల) వంటి అక్షి (కన్నులు కలవాడు), విష్ణువు}; సత్త్వగుణంబు = సత్వగుణము; నీ = నీ యొక్క; గాత్రంబున్ = దేహము; కాదేని = అలాకానిచో; విజ్ఞాన = పరబ్రహ్మజ్ఞానము; కలితము = కూడినది; అగుచున్ = అగుచు; అజ్ఞాన = అజ్ఞానమును; భేదనంబు = పోగొట్టునది; అగుట = అగుట; ఎట్లు = ఎలా వీలగును; గుణముల = త్రిగుణముల; అందునున్ = లోను; వెలుగన్ = ప్రకాశించుచుండుటకు; నీవు = నీవు; అనుమతింపబడుదువు = అంగీకరించెదవు; సత్త్వరూపంబున్ = సత్వగుణరూపమును; సేవింపంగన్ = కొలువగా; సాక్షాత్కరింతువు = దర్శనమిచ్చెదవు; సాక్షివి = ప్రత్యక్షసాక్షివి; అగుచున్ = అగుచు; వాక్ = మాటలకు; మనసముల = మనసుల; కున్ = కు; అవ్వలన్ = అతీతమైనది; ఐన = అయినట్టి; మార్గంబున్ = మార్గము; కలుగున్ = దొరుకును; నీ = నీ యొక్క; గుణ = గుణములు; జన్మ = పునర్జన్మలు; కర్మ = కర్మవాసనలును; రహితము = లేనట్టిది; ఐన = అయిన. రూపునున్ = స్వరూపమును; పేరును = నామమును; అతి = మిక్కిలి; అనఘ = పుణ్యవంతమైన; బుద్ధులు = జ్ఞానులు; ఎఱుగుదురు = తెలిసికొందురు; నిన్నున్ = నిన్ను; కొల్వన్ = సేవించుటను; ఊహించుకొనుచున్ = భావించుచు; వినుచున్ = ఆలకించుచు; తలచుచున్ = ధ్యానముచేయుచు; పొగడుచున్ = కీర్తించుచు; వెలయు = ప్రకాశించెడి; వాడు = అతను; భవమున్ = పునర్జన్మమును; ఒందడు = పొందడు; నీ = నీ యొక్క; పాద = పాదములను; భక్తుడు = కొలచువాడు; అగున్ = అగును.

భావము:– పద్మదళములవంటి కన్నులుగల శ్రీమన్నారాయణా! సత్త్వగుణమే నీ శరీరంగా రూపుదిద్దుకుంది. కాకపోతే విజ్ఞానంతో నిండి వుండి, నీ శరీరం అజ్ఞానాన్ని భేదించడం ఎలా సాధ్యము? గుణములలో కూడా వెలుగుతూ ఉన్నవాడిగా నీవు పరిగణింపబడుతూ ఉన్నావు. అలాకాకుండా నీ సత్త్వరూపాన్నే సేవిస్తే సాక్షాత్కరిస్తావు అటువంటప్పుడు నీవు గుణములకు అంటక కేవలము సాక్షివిగా ఉంటావు. వాక్కుకు మనసుకు అతీతంగా ఉంటుంది నీమార్గం. గుణములకు కర్మలకు అతీతమైన నీరూపాన్ని పుణ్యాత్ములైన వివేకవంతులు గ్రహిస్తున్నారు. నిన్ను సేవిస్తూ భావనచేస్తూ వింటూ స్మరిస్తూ స్తోత్రం చేస్తూ జీవించేవాడు తిరిగి ఈ సంసారాన్ని పొందడు. నీ పాదములనే అంటిపెట్టుకుని భక్తుడై ఉండిపోతాడు.

10.1-98-క.

ధరణీభారము వాసెను
బురుషోత్తమ! యీశ! నీదు పుట్టువున; భవ
చ్చరణాంబుజముల ప్రాపున
ధరణియు నాకసముఁ గాంచెదము నీ కరుణన్.

టీక:- ధరణీభారము = భూభారము; పాసెను = తొలగినది; పురుషోత్తమ = నారాయణా; ఈశా = నారాయణా; నీదు = నీ యొక్క; పుట్టువునన్ = అవతారించుటచేత; భవత్ = నీ యొక్క; చరణ = పాదము లనెడి; అంబుజముల = పద్మము; ప్రాపునన్ = అండతో; ధరణియున్ = భూమిని, ఆధారమును; ఆకసమున్ = ఆకాశమును, రక్షణను; కాంచెదము = చూడగలిగెదము; నీ = నీ; కరుణన్ = కృపవలన.

భావము:- పురుషోత్తమా! ఈశ్వరా! నీవు జన్మించడంవలన ఈ భూమి భారము తగ్గిపోతుంది. నీ పాదపద్మములు అండగా ఉండగా నీ దయవల్ల భూమి ఆకాశము ఎక్కడ ఉన్నాయో చూడగల్గుతాము.

10.1-99-ఉ.

పుట్టువు లేని నీ కభవ! పుట్టుట క్రీడయె కాక పుట్టుటే?
యెట్టనుడున్ భవాదిదశ లెల్లను జీవులయం దవిద్య దాఁ
బుట్టుచు నుండుఁ గాని నినుఁ బుట్టినదింబలెఁ బొంతనుండియుం
జుట్టఁగ లేని తత్క్రియలఁ జొక్కని యెక్కటి వౌదు వీశ్వరా!

టీక:- పుట్టువు = జన్మము అన్నది; లేని = లేనట్టి; నీ = నీ; కున్ = కు; అభవ = నారాయణా {అభవుడు - పుట్టుకలేనివాడు, విష్ణువు}; పుట్టుట = అవతరించుట; క్రీడయె = ఆటలవిహారమే; కాక = తప్పించి; పుట్టుటే = జన్మించుటా, కాదు; ఎట్టు = ఎలా వీలగును; అనుడును = అనినచో; భవ = పుట్టుక; ఆది = మున్నగు; దశలు = స్థితులు; ఎల్లను = సమస్తము; జీవుల = ప్రాణుల; అందున్ = ఎడల; అవిద్య = అజ్ఞానము; తాన్ = తనే; పుట్టుచున్ = కలగుతు; ఉండును = ఉండును; కాని = తప్పించి; నినున్ = నిన్ను; పుట్టినది = కలిగినదాని; బలెన్ = వలె; పొంతన్ = నీ సన్నిధానమున; ఉండియున్ = ఉన్నను; చుట్టగన్ = ఆవరించగా; లేని = లేనట్టి; తత్ = ఆ; క్రియలన్ = కర్మములందు; చొక్కని = తగులములేని; ఎక్కటివి = ఒంటరివి, శేషీభూతుడవు; ఔదు = అయ్యెదవు; ఈశ్వరా = సర్వమునకు ప్రభువా.

భావము:- పుట్టుక ఎరుగని నారాయణా! నీకు పుట్టుట అంటూ వేరే లేదు. అటువంటి నీవు ఇలా పుట్టడం అనేది నీకు క్రీడ గాని పుట్టుక కాదు కదా. అది ఎలా అంటే జన్మ మరణం మొదలైన స్థితులన్ని మాయకారణంగా జీవులను ఆవరిస్తూ ఉంటాయి. కానీ, నిన్ను మాత్రం ఆ మాయాదేవి ప్రక్కన నిలబడి కూడా స్పృశించలేక దూరంగా ఉండిపోతుంది. కనుక ఆ మాయామయమైన క్రియలు వేటిలోనూ చిక్కకుండా ఏకైక మూర్తివిగా నిండిపోతావు. కనుకనే ఈ జగత్తులు సమస్తానికీ నీవు ఈశ్వరుడవు.

10.1-100-మ.

గురు పాఠీనమవై, జలగ్రహమవై, కోలంబవై, శ్రీనృకే
సరివై, భిక్షుఁడవై, హయాననుఁడవై, క్ష్మాదేవతాభర్తవై,
ధరణీనాథుడవై, దయాగుణగణోదారుండవై, లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద; మిలాభారంబు వారింపవే.

టీక:- గురు = దొడ్డ; పాఠీనమవు = మత్స్యావతారుడవు; ఐ = అయ్యి; జలగ్రహమవు = కూర్మావతారుడవు; ఐ = అయ్యి; కోలంబవు = వరాహావతారుడవు; ఐ = అయ్యి; శ్రీ = సంపత్కరమైన; నృకేసరివి = నరసింహావతారుడవు; ఐ = అయ్యి; భిక్షుడవు = వామనావతారుడవు; ఐ = అయ్యి; హయాననుడవు = హయగ్రీవావతారుడవు; ఐ = అయ్యి; క్ష్మాదేవతాభర్తవు = పరశురామావతారుడవు {క్ష్మాదేవతాభర్త - క్ష్మాదేవతా (బ్రాహ్మణులలో) భర్త (శ్రేష్ఠుడు), పరశురాముడు}; ఐ = అయ్యి; ధరణీనాథుడవు = శ్రీరామావతారుడవు; ఐ = అయ్యి; దయాగుణ = దయాది సుగుణముల; గణ = సముదాయములు; ఉదారుడవు = అధికముగా కలవాడవు; ఐ = అయ్యి; లోకముల్ = చతుర్దశలోకములను; పరిరక్షించిన = కాపాడిన; నీ = నీ; కున్ = కు; మ్రొక్కెదము = నమస్కరించుచున్నాము; ఇలా = భూమి యొక్క; భారమున్ = భారమును; వారింపవే = తొలగించుము.

భావము:- మహా మత్స్యావతార మెత్తి, కూర్మావతారం, వరాహావతారం, నరసింహావతారం, వామనావతారం, హయగ్రీవావతారం, పరశురామావతారం, శ్రీరామావతారం మున్నగు అనేకావతారాలు యెత్తి దయాదాక్షిణ్యాది గుణాలతో, ఉదారుడవై లోకాలను రక్షించిన నీకు ఇదే మేము నమస్కరిస్తున్నాము; ఈ భూమి భారాన్ని తొలగించమని ప్రార్థిస్తున్నాము.

10.1-101-క.

ముచ్చిరి యున్నది లోకము

నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయు లేఁపన్;
మచ్చికఁ గావఁగ వలయును
విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా!"

టీక:- ముచ్చిరి = దుఃఖితురాలు అయి; ఉన్నది = ఉంది; లోకము = ప్రపంచము; నిచ్చలు = నిత్యము; కంస = కంసుడు; ఆది =మొదలైన ; ఖలులు = దుర్మార్గులు; నిర్దయులు = కరుణ లేనివారు; ఏపన్ = బాధించుతుండగా, వేపుకుతింటుండగా; మచ్చికన్ = ప్రీతిగా; కావఁగవలయును = కాపాడవలసి ఉన్నది; విచ్చేయుము = రమ్ము; తల్లి = తల్లి యొక్క; కడుపున్ = గర్భము; వెడలి = బయటకు వచ్చి; ముకుందా = శ్రీహరి {ముకుందుడు - ఇహపర సుఖములనిచ్చువాడు, ముంచకుంచదదాతీతి ముకుందః, తస్య బుద్ధిః ముకుంద (సంబోధనేవాదీర్ఘస్వాదితి సూత్రేణ ముకుందా), విష్ణువు}.

భావము:- ముకుందా! కంసుడు మొదలైన దుర్మార్గులు క్రూరంగా వేధిస్తూ బాధిస్తూ ఉంటే ఈ లోకం నిత్యం దుఃఖంలో మునిగిపోయి ఉంది. లోకాన్ని కాపాడడానికి తల్లి కడుపులోనుండి వెంటనే బయటకి రావయ్యా!"

10.1-102-వ.

అని మఱియు దేవకీదేవిం గనుంగొని యిట్లనిరి.

టీక:- అని = అని; మఱియున్ = ఇంకను; దేవకీ = దేవకి యనెడి; దేవిన్ = ఉత్తమురాలను; కనుంగొని = చూసి; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- బ్రహ్మాదిదేవతలు అలా విష్ణువును ప్రార్థించి దేవకిదేవిని చూసి ఇలా అన్నారు.

10.1-103-మత్త.

"తల్లి! నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ
డెల్లి పుట్టెడిఁ; గంసుచే భయ మింత లేదు; నిజంబు; మా
కెల్లవారికి భద్రమయ్యెడు; నింక నీ కడు పెప్పుడుం
జల్లగావలె యాదవావళి సంతసంబునఁ బొంగఁగన్.

టీక:- తల్లి = అమ్మ; నీ = నీ యొక్క; ఉదరంబున్ = కడుపు; లోనన్ = అందు; ప్రధానపూరుషుండు = శ్రీహరి

{ప్రధానపూరుషుడు - ప్రధాన (ముఖ్యమైన, ఆది) పూరుషుడు (కారణాత్మకమైనవాడు, పురుషము (కారణభూతము) తానైనవాడు), విష్ణువు}; ఉన్నవాడు = ఉన్నాడు; ఎల్లి = రేపు; పుట్టెడిన్ = జన్మించును; కంసు = కంసుని; చేన్ = వలన; భయము = బెదురుట; ఇంత = ఏమాత్రము; లేదు = అక్కరలేదు; నిజంబు = ఇది తథ్యము; మేము = మా; కున్ = కు; ఎల్లవారు = అందర; కిన్ = కు; భద్రము = క్షేమము; అయ్యెడిన్ = కలుగును; ఇంకన్ = ఇకపైన; నీ = నీ యొక్క; కడుపు = కడుపు; ఎప్పుడున్ = ఎల్లప్పుడు; చల్లన్ = చల్లగా; కావలెన్ = ఉండుగాక; యాదవ = యాదవుల; ఆవళి = సమూహములు; సంతసంబునన్ = సంతోషముతో; పొంగగన్ = ఉప్పొంగగా.

భావము:- "తల్లీ! దేవకీదేవీ! నీ గర్భంలో పురుషోత్తముడు ఉన్నాడు. రేపు పుట్టబోతున్నాడు కంసుడి వలన ఏమాత్రం భయంలేదు. మామాట నమ్ము. ఈనాటి నుండి మాకందరికీ క్షేమం చేకూరుతుంది. యాదవులు అందరూ సంతోషంతో పొంగిపోతున్నారు. ఎల్లవేళలా నీ కడుపు చల్లగా వర్ధిల్లాలి."

10.1-104-వ.

అని యి వ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవత లీశాన బ్రహ్మల మున్నిడుకొని చని; రంత .

టీక:- అని = అని; ఈ = ఈ; విధంబునన్ = విధముగ; హరిన్ = నారాయణుని; పొగిడి = స్తుతించి; దేవకీ = దేవకి యనెడి; దేవిని = ఉత్తమురాలను; దీవించి = ఆశీర్వదించి; దేవతలు = దేవతలు; ఈశాన = శివుని {ఈశానుడు - ఈశాన్యదిక్కునకు అధిపతి, పరమ శివుడు}; బ్రహ్మలన్ = బ్రహ్మదేవుడిని; మున్ను = ముందు; ఇడుకొని = ఉంచుకొని; చనిరి = వెళ్ళిపోయిరి; అంత = తరువాత.

భావము:- ఇలా విష్ణుమూర్తిని స్తుతించి, దేవకీదేవిని దీవించి, దేవతలు అందరూ శివుడిని, బ్రహ్మదేవుడిని ముందు ఉంచుకొని బయలుదేరి వెళ్ళిపోయారు.

## దేవకి కృష్ణుని కనుట

10.1-105-క.

పంకజముఖి నీ ళ్ళాడఁను

సంకటపడ ఖలులమానసంబుల నెల్లన్
సంకటము దోఁచె; మెల్లన
సంకటములు లేమి తోఁచె సత్పురుషులకున్.

టీక:- పంకజముఖి = సౌందర్యవతి; నీళ్ళాడను = ప్రసవించుటకు; సంకటబడన్ = నెప్పులు పడుతుండగా; ఖలుల = దుష్టుల; మానసంబులు = మనసులు; ఎల్లన్ = సమస్తమును; సంకటము = కీడులు; తోచెన్ = కనబడెను; మెల్లనన్ = శాంతిగా; సంకటములు = బాధలు; లేమి = లేకపోవుటలు; తోచెన్ = కనబడెను; సత్పురుషుల్ = సజ్జనుల; కున్ = కు.

భావము:- పద్మం వంటి ముఖం గల దేవకి కృష్ణుని కనుటకు ప్రసవవేదనలు పడుతుంటే దుష్టుల మనస్సులలో ఏదో తెలియని ఆవేదన కలిగింది. మంచివారికి కష్టాలు నెమ్మదిగా తొలగిపోతున్న సూచనలు కనిపించాయి.

10.1-106-సీ.

స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును-
గలఘోషణముల మేఘంబు లుఱిమె;
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె-
దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ;
గమ్మని చల్లని గాలి మెల్లన వీఁచె-
హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ;
గొలఁకులు కమలాళికులములై సిరి నొప్పెఁ-
బ్రవిమలతోయలై పాఱె నదులు;

10.1-106.1-తే.

వర పుర గ్రామ ఘోష యై వసుధ యొప్పె;
విహగ రుత పుష్ప ఫలముల వెలసె వనము;

లలరుసోనలు గురిసి ర య్యమరవరులు;
దేవదేవుని దేవకీదేవి గనఁగ.

టీక:- స్వచ్ఛంబులు = నిర్మలములు; ఐ = అయ్యి; పొంగె = పోటెత్తినవి; జలరాసులేడును = సప్తసముద్రములు {సప్తసముద్రములు - 1లవణ 2ఇక్షు 3సురా 4సర్పి 5దధి 6క్షీర 7జల సముద్రములు ఏడు}; కల = అవ్యక్తమధురమైన; ఘోషణముల = మేఘధ్వనులతో; మేఘంబులున్ = మేఘములు; ఉఱిమెన్ = ఉఱిమినవి; గ్రహ = బుధాది గ్రహములతోటి; తారకల = అశ్వినాది చుక్కల; తోడన్ = తోటి; గగనంబున్ = ఆకాశము; రాజిల్లెన్ = ప్రకాశించెను; దిక్కులు = అష్టదిక్కులు; మిక్కిలి = అధికముగా; తెలివిన్ = తేటదనములను; తాల్చెన్ = ధరించెను; కమ్మని = సువాసనలు కల; చల్లని = చల్లగానున్న; గాలి = వాయువులు; మెల్లనన్ = మెత్తగా; వీచెన్ = వీచినవి; హోమానలంబున్ = హోమాగ్ని; చెన్నొంది = కాంతివంతమై; వెలిగెన్ = ప్రకాశించెను; కొలకులు = సరోవరములు; కమల = పద్మముల; అళి = తుమ్మెదల; కులములు = సమూహములుకలవి; ఐ = అయ్యి; సిరిన్ = కాంతిచేత; ఒప్పెన్ = చక్కగానుండెను; ప్ర = మిక్కిలి; విమల = నిర్మలములైన; తోయంబులు = నీరు కలవి; ఐ = అయ్యి; పాఱెన్ = ప్రవహించెను; నదులు = ఏరులు.
వర = శ్రేష్ఠములైన; పుర = పట్టణములు; గ్రామ = గ్రామములు; ఘోషన్ = గొల్లపల్లెలుగలది; ఐ = అయ్యి; వసుధ = భూమండలము; ఒప్పెన్ = అందగించెను; విహగ = పక్షుల; రుత = కూతలతో; పుష్ప = పూలతో; ఫలముల = పండ్లతో; వెలసెను = విలసిల్లెను; వనములున్ = తోటలు; అలరు = పూల; సోనలు = జల్లులు; కురిసిరి = వర్షించిరి; ఆ = ఆ; అమర = దేవతా; వరులు = శ్రేష్ఠులు; దేవదేవుని = విష్ణుమూర్తిని; దేవకీ = దేవకి అనెడి {దేవదేవుడు - బ్రహ్మేంద్రాది దేవతలందరకు దేవుడైనవాడు, విష్ణువు}; దేవి = ఉత్తమురాలు; కనగ = ప్రసవించునప్పుడు.

భావము:- దేవకీదేవి శ్రీకృష్ణభగవానుని ప్రసవిస్తున్నట్టి ఆ సమయంలో ఏడు సముద్రాలు ఉప్పొంగాయి. మేఘాలు ఆనందంతో ఉరుముల చాటింపు వేసాయి. ఆకాశం గ్రహాలతో తారకలతో ప్రకాశించింది. దిక్కులన్ని దివ్యకాంతులతో నిండిపోయాయి. చల్లగాలి కమ్మని వాసనలతో మెల్లగా వీచింది. హోమగుండాలలోని అగ్ని జాజ్వల్యమానంగా వెలిగింది. తుమ్మెదలతో కూడిన పద్మాల గుంపులతో సరోవరాలు కళకళ లాడాయి. నదులు నిర్మలమైన నీటితో ప్రవహించాయి. శ్రేష్ఠమైన నగరాలు, గ్రామాలు, గొల్లపల్లెలుతో భూదేవి వెలిగి పోయింది. పక్షుల కిలకిలారావాలతో, పూలతో పండ్లతో ఉద్యానవనాలు, అరణ్యాలు విలసిల్లాయి. దేవతలు పుష్పవర్షాలు కురిపించారు.

10.1-107-క.

పాడిరి గంధర్వోత్తము;

లాడిరి రంభాది కాంత; లానందమునన్

గూడిరి సిద్ధులు; భయముల

వీడిరి చారణులు; మొరసె వేల్పుల భేరుల్.

టీక:- పాడిరి = గానములు చేసిరి; గంధర్వ = గంధర్వులలో {గంధర్వోత్తములు - చిత్రసేనాదులు}; ఉత్తములు = శ్రేష్ఠులు; ఆడిరి = నాట్యము లాడిరి; రంభాదికాంతలు = అప్సరసలు {రంభాదికాంతలు - అప్సరసలు (రంభ ఊర్వశి తిలోత్తమ అలంబుస మున్నగువారు )}; ఆనందమునన్ = ఆనందముతో; కూడిరి = చేరి ఆనందించిరి; సిద్ధులు = సిద్ధులు {సిద్ధులు - విశ్వావసువు పరావసువు మొదలైనవారు}; భయములన్ = బెదురుటను; వీడిరి = వదలివేసిరి; చారణులు = దేవయోని విశేషము {చారణులు – దేవగాయకజాతి వారు, వ్యు. కీర్తిని నలుదిశల వ్యాపింపజేయువారు}; మొరసెన్ = మోగినవి; వేల్పుల = దేవతల యొక్క; భేరుల్ = నగారాలు, పెద్దడోళ్ళు.

భావము:- శ్రేష్ఠులైన గంధర్వులు (నారద, చిత్రసేనాదులు) దివ్యగానాలు చేసారు; రంభ మొదలైన అప్సరసలు నృత్యాలు చేసారు; సిద్ధులు అనే దేవతలు ఆనందంతో గుంపులు గుంపులుగా చేరారు; చారణులు అనే దేవతలకు భయం తీరి ఆనందించారు; దేవతలు ఉత్సవంగా భేరీలు మోగించారు;

10.1-108-వ.

అ య్యవసరంబున.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు.

భావము:- అలాంటి సమయంలో:

10.1-109-క.

సుతుఁ గనె దేవకి నడురే

యతి శుభగతిఁ దారలును గ్రహంబులు నుండన్

దితిసుతనిరాకరిష్ణున్

శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్.

టీక:- సుతున్ = పుత్రుని; కనెన్ = ప్రసవించెను; దేవకి = దేవకీదేవి; నడురేయి = అర్ధరాత్రి; అతి = మిక్కిలి;

శుభ = శుభ ఫలితముల నిచ్చెడి; గతిన్ = విధముగ; తారలును = నక్షత్రములు; గ్రహంబులున్ = గ్రహములు; ఉండన్ = ఉండగా; దితిసుతనిరాకరిష్ణున్ = శ్రీకృష్ణుని {దితి సుత నిరాకరిష్ణుడు – దితియొక్క పుత్రులైన రాక్షసులను తిరస్కరించువాడు, విష్ణువు}; శ్రితవదనాలంకరిష్ణు = శ్రీకృష్ణుని {శ్రిత వదనాలంకరిష్ణుడు – శ్రిత (ఆశ్రయించినవారి) వదన (మోములను) అలంకరిష్ణుడు (వికాసవంతము చేయు శీలముగల వాడు, ఆనందింపజేయు శీలముగల వాడు), విష్ణువు}; జిష్ణున్ = శ్రీకృష్ణుని {జిష్ణుడు – జయశీలుడు, విష్ణువు}; విష్ణున్ = శ్రీకృష్ణుని {విష్ణుడు – విశ్వమునకు వెలుపల లోపల వ్యాపించి యుండువాడు, హరి}.

భావము:– దేవకీదేవి అర్థరాత్రి వేళ నక్షత్రాలు గ్రహాలు అత్యంత శుభస్థానాలలో ఉండగా, రాక్షసులను శిక్షించేవాడు; ఆశ్రయించినవారి ముఖాలలో ఆనందం నింపేవాడు; జయశీలము గలవాడు; విశ్వం అంతా వ్యాపించి ఉండువాడు అయిన శ్రీమహావిష్ణువును ప్రసవించింది.

10.1-110-క.

వెన్నుని నతిప్రసన్నునిఁ

గ్రన్నన గని మెఱుఁగుఁబోఁడి గడు నొప్పారెం

బున్నమనాఁడు కళానిధిఁ

గన్న మహేంద్రాశ చెలువు గలిగి నరేంద్రా!

టీక:– వెన్నుని = విష్ణుమూర్తిని; అతి = మిక్కిలి; ప్రసన్నునిన్ = అనుగ్రహము కలవానిని; క్రన్ననన్ = గబుక్కున; కని = చూసి; మెఱుగుబోడి = సుందరి {మెఱుగు బోడి – మెఱుగు (కాంతివంత మైన) పోడి (పడతి), అందగత్తె}; కడున్ = మిక్కిలి; ఒప్పారెన్ = అందగించెను; పున్నమ = పౌర్ణమి; నాడు = దినమున; కళానిధిన్ = పూర్ణ చంద్రుని {కళానిధి – కళలు సమృద్ధిగా కలవాడు, చంద్రుడు}; కన్న = ప్రసవించెడి; మహేంద్రాశ = తూర్పుదిక్కు {మహేంద్రాశ – మహేంద్రుని యొక్క ఆశ (దిక్కు), తూర్పు}; చెలువు = అందము; కలిగి = ఉండి; నరేంద్రా = రాజా {నరేంద్రుడు – నరులకు ప్రభువు, రాజు}.

భావము:– ఓ పరీక్షిన్నరేంద్రా! శ్రీ మన్నారాయణుని ప్రసవించి దేవకి మెరుపు తీగలా మెరిసి పోతూ మిక్కిలి అందంగా ఉన్నది; ఆ సమయంలో, దేవకి నిండు పౌర్ణమినాటి పదహారు కళలతో నిండిన చంద్రుని కన్న తూర్పు దిక్కు అంత అందంగా ఉంది.

10.1-111-వ.

అప్పుడు.

టీక:- అప్పుడు = ఆ సమయమునందు.

భావము:- అప్పుడు.

10.1-112-సీ.

జలధరదేహు నాజానుచతుర్బాహు-
సరసీరుహాక్షు విశాలవక్షుఁ
జారు గదా శంఖ చక్ర పద్మ విలాసుఁ-
గంఠకౌస్తుభమణికాంతి భాసుఁ
గమనీయ కటిసూత్ర కంకణ కేయూరు-
శ్రీవత్సలాంఛనాంచిత విహారు
నురుకుండలప్రభాయుత కుంతలలలాటు-
వైడూర్యమణిగణ వరకిరీటు

10.1-112.1-తే.

బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక
పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ
జూచి తిలకించి పులకించి చోద్య మంది
యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె.

శ్రీ మహావిష్ణువు ఆయుధాలు – పుట 89 చూ.

టీక:- జలధర = మేఘములవంటి {జరధరము - నీటిని ధరించునది, మేఘము}; దేహున్ = శరీరపురంగు కలవానిని; ఆజాను = మోకాళ్ళదాకా (పొడవుగా) ఉండెడి; చతుర్ = నాలుగు (4); బాహున్ = చేతులు కలవానిని; సరసీరుహ = పద్మములవంటి; అక్షున్ = కన్నుల కలవానిని; విశాల = మిక్కిలి వైశాల్యము కల; వక్షున్ = వక్షస్థలము కలవానిని; చారు = అందమైన; గద = గద (కౌమోదకి); శంఖ = శంఖం (పాంచజన్యము); చక్ర = చక్రము (సుదర్శనము); పద్మ = తామర పుష్పములతో; విలాసున్ = విలసిల్లువానిని; కంఠ = కంఠమునందు;

కౌస్తుభమణి = కౌస్తుభము అనెడి రత్నం; కాంతి = వెలుగులుతో; భాసున్ = ప్రకాశించువానిని; కమనీయ = చూడచక్కని; కటి = మొల; సూత్ర = నూలు; కంకణ = కంకణములు; కేయూరున్ = దండకడియాలు గలవానిని; శ్రీవత్స = శ్రీవత్సము అనెడి; లాంఛన = గురుతు, పుట్టుమచ్చ; అంచిత = మనోహరమైన; విహారున్ = క్రీడించువానిని; ఉరు = అధికమైన; కుండల = చెవికుండలముల; ప్రభా = కాంతులతో; యుత = కూడిన; కుంతల = ముంగురులుగల; లలాటున్ = నుదురు కలవానిని; వైడూర్య = వైడూర్యము మున్నగు; మణి = రత్నములు; గణ = అనేకములతో; నర = శ్రేష్ఠమైన; కిరీటున్ = కిరీటము గలవానిని.

బాలున్ = చిన్నపిల్లవానిని; పూర్ణ = నిండు; ఇందు = జాబిల్లి; రుచి = మెరుపులు; చాలు = చాలాకలవానిని; భక్త = భక్తులు; లోక = అందరను; పాలున్ = కాపాడువానిని; సుగుణ = మంచిగుణములకు {సుగుణములు - శమము దమము శాంతము సర్వజ్ఞత్వము మున్నగు మంచిగుణములు}; అలవాలము = ఉనికిపట్టైనవానిని; చూచి = కనుగొని; తిలకించి = చూసి; పులకించి = సంతోషించి; చోద్యమంది = అబ్బురపడి; ఉబ్బి = ఉప్పొంగి; చెలరేగి = విజృంభించి; వసుదేవుడు = వసుదేవుడు; ఉత్సహించెన్ = ఉత్సాహముచెందెను.

భావము:- ఆ బాలుడు దివ్యరూపంతో వసుదేవునికి దర్శనమిచ్చాడు. అతడు నీలమేఘ వర్ణ దేహం కలిగి ఉన్నాడు; (మోకాళ్ళ వరకు) పొడవైన నాలుగు చేతులలో గద శంఖం చక్రం పద్మం వెలుగొందుతున్నాయి; తామరరేకుల వంటి కళ్ళు, విశాలమైన వక్షం ఉన్నాయి; కంఠంలో కౌస్తుభమణి కాంతులు వెలుగుతున్నాయి; అందమైన మొలతాడు, కంకణాలు, భుజకీర్తులు ధరించి ఉన్నాడు; శ్రీవత్సము అనే పుట్టుమచ్చ వక్షం మీద మెరుస్తున్నది; చెవికుండలాల కాంతితో ముంగురులు వెలిగిపోతున్నాయి; వైడూర్య మణులు పొదగిన కిరీటం ధరించి ఉన్నాడు; పూర్ణచంద్రుని కాంతులీనుతున్నాడు.; అతడు భక్తులందరిని రక్షించే వాడు; సృష్టిలోని సగుణాల పోగు; అతి విశాలమైన కరుణ కలవాడు; వసుదేవుడు ఆ హరిని కనుగొని చూసి పులకించి, ఆశ్చర్యంతో మైమరచి ఉప్పొంగి, ఉబ్బితబ్బిబయ్యాడు.

10.1-113-క.

స్నానముచేయఁగ రామిని

నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్

ధేనువులం బదివేలను

మానసమున ధారవోసె మఱి యిచ్చుటకున్.

టీక:- స్నానము = స్నానము, నీళ్ళపోసుకొనుట; చేయగరామిని = చేయలేకపోవుటచేత; ఆనంద =

ఆనందమనెడి; రస = రసమునందు; మగ్నుడు = మునిగినవాడు; ఐ = అయ్యి; విప్రుల్ = బ్రాహ్మణుల; కున్ = కు; ధేనువులన్ = గోవులను; పదివేలను = పదివేలింటిని (10,000); మానసమునన్ = మనసునందు; ధారపోసెన్ = ధారాదత్తముచేసెను; మఱి = మరి; ఇచ్చుట = దానముచేయుట; కున్ = కు.

భావము:– స్నానం చేయడం వీలుకాకపోవుట చేత ఆనంద రసమనే సముద్రంలో మునిగి తేలుతున్న వసుదేవుడు బ్రాహ్మణులకు "పదివేల ఆవులు దానం చేస్తున్నాను"అని మానసికంగా ధారపోసాడు.

10.1-114-వ.

మఱియు వసుదేవుండు.

టీక:– మఱియున్ = ఇంకను; వసుదేవుండు = వసుదేవుడు.

భావము:– ఇంకా వసుదేవుడు.

10.1-115-క.

"ఈ పురిటియింటి కుద్య
ద్దీపంబును బోలి చాల దీపించె నిజం
బీ పాపఁడు నలు మొగముల
యా పాపని గనిన మేటి యగు"నని భక్తిన్.

టీక:– ఈ = ఇక్కడి; పురిటి = ప్రసవ; ఇంటి = గృహమున; కున్ = కు; ఉద్యత్ = మిక్కిలి ప్రకాశించెడి; దీపంబున్ = దీపమును; పోలి = వలె; చాల = అధికముగ; దీపించెన్ = ప్రకాశించెను; నిజంబున్ = తథ్యముగా; ఈ = ఈ; పాపడు = శిశువు; నలు = నాలుగు (4); మొగముల = ముఖములు కలిగిన; ఆ = ఆ; పాపనిన్ = పుత్రుడైన బ్రహ్మదేవుని; కనిన = పుట్టించిన; మేటి = గొప్పవాడు; అగును = అయ్యే ఉండును; అని = అని; భక్తిన్ = భక్తితో.

భావము:– ఇంకా వసుదేవుడు “పురిటింటికి దీపంలా వెలుగొందుచున్న ఈ పాపడు నిజానికి చతుర్ముఖ బ్రహ్మని కన్న మహానుభావుడు అయిన విష్ణుమూర్తే.” అని అనుకొన్నాడు.

## వసుదేవుడు కృష్ణుని పొగడుట

10.1-116-ఆ.

చాఁగి మ్రొక్కి లేచి సరగున నొసలిపైఁ

గేలుఁదమ్మిదోయిఁ గీలుకొలిపి

పాపఁ డనక వెఱక పాపని మొదలింటి

పోకలెల్లఁ దలఁచి పొగడఁ దొడఁగె.

టీక:- సాగి = సాగిలపడి {సాగిలపడుట - సాష్టాంగ నమస్కారము చేయుట}; మొక్కి = నమస్కరించి; లేచి = పైకి లేచి; సరగునన్ = త్వరితముగ; నొసలి = నుదిటి; పైన్ = మీద; కేలున్ = చేతులు అనెడి; తమ్మి = పద్మముల; దోయిన్ = జంటను; కీలుగొలిపి = తగిల్చి; పాపడు = చిన్నపిల్లవాడు; అనకన్ = అనుకోకుండ; వెఱకన్ = వెనుదీయక; పాపని = శిశువును; మొదలింటి = పూర్వపు; పోకలు = నడవడికలు; ఎల్లన్ = అన్నిటిని; తలచి = తర్కించుకొని; పొగడ = కీర్తించుట; తొడగెన్ = మొదలిడెను.

భావము:- భక్తితో సాష్టాంగపడి నమస్కారం చేసాడు. లేచి రెండు చేతులనూ తామర మొగ్గల వలె నుదురు పై జోడించాడు. పసి పిల్లాడు అని వెనుదీయకుండా అతని దివ్య చరిత్రలు అన్నీ తలచుకొని పొగడసాగేడు.

10.1-117-క.

"ఏ నిన్ను నఖిలదర్శను

జ్ఞానానందస్వరూపు సంతతు నపరా

ధీనుని మాయాదూరుని

సూనునిఁగాఁ గంటి; నిట్టి చోద్యము గలదే?

టీక:- ఏ = ఎటువంటి; నిన్నున్ = నిన్ను; అఖిల = సమస్తమును {అఖిల - సమస్తమైన చతుర్దశ భువనములను}; దర్శనున్ = పాలించువానిని {దర్శనుడు - సాక్షీభూతముగ చూచువాడు}; జ్ఞాన = జ్ఞానము; ఆనంద = ఆనందములను; స్వరూపు = తన రూపుగా కలవానిని; సంతతున్ = శాశ్వతుని; అపరాధీనుని = సర్వస్వతంత్రుని; మాయా = జననాది ఎల్లమాయలకు; దూరునిన్ = పరమైన వానిని, తిరస్కరించు వానిని; సూనునిన్ = పుత్రుని; కాన్ = అగునట్లు; కంటిన్ = పుట్టించితిని, చూసితిని ఇట్టి = ఇటువంటి; చోద్యమున్ =

అద్భుతము; కలదే = ఎక్కడైనా ఉన్నదా, లేదు.

భావము:- "స్వామీ! నీవు సమస్త సృష్టిని నీ యందు దర్శింప జేస్తావు; జ్ఞానము ఆనందము కూడిన స్వరూపుడవు; నీవు శాశ్వతుడవు; ఎవరి అదుపాజ్ఞలకు నీవు లోబడవు; మాయ నిన్ను అంటలేక దూరంగా తొలగిపోతుంది; అట్టి నిన్ను నేను కన్నానట; ఇలాంటి చోద్యం ఎక్కడైనా ఉందా?

10.1-118-క.

అచ్చుగ నీ మాయను మును
జెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముల్
జొచ్చిన క్రియఁ జొరకుందువు
చొచ్చుటయును లేదు; లేదు చొరకుండుటయున్.

టీక:- అచ్చుగన్ = స్ఫుటముగ; నీ = నీ యొక్క; మాయనున్ = మహిమచేత; మును = పూర్వము; చెచ్చెరన్ = శీఘ్రముగ; త్రిగుణాత్మకము = త్రిగుణములతో ఏర్పడినది {త్రిగుణాత్మకము – త్రిగుణములు కలది, సత్వగుణముచేత ఇంద్రియాధిదేవతలను రజోగుణముచేత ఇంద్రియములను తమోగుణముచేత పంచమహాభూతములను కలిగినది}; కాన్ = అగునట్లు; చేసిన = చేసినట్టి; జగముల్ = భువనములను; చొచ్చిన = ప్రవేశించినవాని; క్రియన్ = వలె ఉండి; చొరకుందువు = ప్రవేశించక ఉందువు; చొచ్చుటయును = ప్రవేశించుట; లేదు = లేదు; లేదు = లేనేలేదు; చొరకుండుటయును = ప్రవేశించకపోవుట కూడ.

భావము:- నీ మాయను చక్కగా నీ నుండి వెలువరచి సత్వం, రజస్సు, తమస్సు అనే త్రిగుణాలుగా విస్తరింపజేస్తావు. ఆ మూడు గుణాలతోను జగత్తులన్నీ సృష్టింపబడుతాయి. త్రిగుణాలు నీలో నిండి ఉంటాయి. కనుక సృష్టిలో ప్రవేశించడం ఉండదు. అలా అని ప్రవేశించక పోవడమూ ఉండదు.

10.1-119-సీ.

అదియు నెట్లన మహదాదులఁ బోలెడి-
  దై వేఱువేఱయై యన్నివిధము
లగు సూక్ష్మభూతంబు లమర షోడశ వికా-
  రములతోఁ గూడి విరాట్టనంగఁ
బరమాత్మునకు నీకు బఱపైన మేను సం-

పాదించి యందు లోఁబడియుఁ బడక
యుండు సృష్టికి మున్న యున్న కారణమున-
వానికి లోనిభవంబు గలుగ;

10.1-119.1-ఆ.

దట్లు బుద్ధి నెఱుఁగ ననువైన లాగునఁ
గలుగు నింద్రియముల కడలనుండి
వాని పట్టులేక వరుస జగంబులఁ
గలసియుండి యైనఁ గలయ వెపుడు.

షోడశవికారములు – పుట 90 చూ.

టీక:- అదియున్ = అలా; ఎట్లు = ఎలా కుదురుతుంది; అనన్ = అని అడిగినచో; మహత్ = మహతత్త్వము {మహదాదులు - అవ్యక్తము మహత్తు అహంకారము పంచమహాభూతములు}; ఆదులన్ = మున్నగువానిని; పోలెడిది = వంటిది; ఐ = అయ్యి; వేఱువేఱ = విభిన్నములు; ఐ = అయ్యి; అన్ని = సమస్తమైన; విధములు = రకములవి; అగు = ఐన; సూక్ష్మభూతంబుల్ = శబ్ద స్పర్శ రూప రస గంధములు; అమరన్ = అమరి యున్నట్టి; షోడశవికారముల = షోడశవికారముల {షోడశవికారములు - ఏకాదశేంద్రియములు [పంచ జ్ఞానేంద్రియములు (కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మము) + పంచ కర్మేంద్రియములు (కాళ్ళు, చేతులు, వాక్కు, గుదము, గుహ్యేంద్రియము) మఱియు పంచ భూతములు (భూమి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము)] మరొక విధము పంచప్రాణములు (5) అంతఃకరణ (1) జ్ఞానేంద్రియములు (5) కర్మేంద్రియములు (5)}; తోన్ = తోటి; కూడి = కలిసి; విరాట్టు = విశ్వరూపుడు; అనగన్ = అనెడి; పరమాత్మున్ = పరబ్రహ్మమున; కున్ = కు; నీ = నీ; కున్ = కు; పఱపు = విశాలము; ఐన = అయినట్టి; మేను = దేహము; సంపాదించి = కల్పించుకొని; అందు = దాని; లోన్ = అందు; బడియున్ = చిక్కి, భోగసాధన కలిగి; పడక = చిక్కకుండగ, అతీతుడవై; ఉండు = ఉండెడి; సృష్టి = మహదాదిసృష్టికి; మున్న = ముందు; ఉన్న = ఉన్నట్టి; కారణమున = కారణముచేత; వాని = వాటి; కిన్ = కి; లోనిభవంబు = లోనైన పుట్టుక; కలుగదు = సంభవించదు; అట్లు = ఆ విధముగ.
బుద్ధిన్ = జ్ఞానముచేత; ఎఱుగను = తెలిసికొనుటకు; అనువు = వీలు; ఐన = అయినట్టి; లాగునన్ = విధముగ; కలుగుచున్ = ఉంటూ; ఇంద్రియముల = ఇంద్రియ {చతుర్దశేంద్రియములు - కర్మేంద్రియములు (5) జ్ఞానేంద్రియములు (5) అంతఃకరణ చతుష్టయము (4)}; కడలన్ = విషయము లందు

{అంతఃకరణచతుష్టయము - 1మనస్సునకు సంకల్పము 2బుద్ధికి నిశ్చయము 3చిత్తమునకు చింతనము 4అహంకారమునకు అహంభావము}; ఉండి = వర్తించియు; వాని = వాటికి; పట్టు = తగులము, సంబంధము; లేక = లేకుండగ; వరుసన్ = క్రమముగా; జగంబులన్ = సమస్తభువనములందు; కలసి = చేరి; ఉండి = ఉన్నవాడవు; ఐనన్ = అయినను; కలయవు = అంటవు; ఎప్పుడున్ = ఏ కాలము నందును.

భావము:- అది ఎలాగ అంటే, సృష్టికి ముందు సృష్టిలో ఉండవలసిన సూక్ష్మ శక్తులన్నీ కలిసి నీకు విరాట్ అనే పేరుగల శరీరం నిర్మిస్తాయి. అలా నిర్మించడానికి పదహారు వికారాలు అనబడే ప్రకృతి వికారాలతో ఆ సూక్ష్మ శక్తులు కలసిపోతాయి. ఆ విరాట్ అనే శరీరం నీకు విస్తరించడానికి అవసరమైనది. ఆ నీ శరీరం సృష్టికి ఆధారమైన మహత్తు మొదలైన ధర్మాల వంటిదే గాని, వానికన్న వేరుగా కూడా ఉంటుంది. ఆ శరీరంలో నీవు ప్రవేశించి ఉండి, దానికి అతీతంగా కూడా ఉంటావు. ఎందుచేతనంటే అది నీ శక్తి అనే నీటి నుండి తయారైన బుడగ వంటిది. నీవు సృష్టికి ముందు కూడా ఉన్నందు వలన విరాట్టులోనికి నీవు పుట్టడం ఉండదు. మానవులకు ఇంద్రియాల ప్రవృత్తులు ఎక్కడ ఆగిపోతాయో అక్కడ ఉండి బుద్ధితో పరిశీలిస్తే ఈ విధమైన జ్ఞానం కలుగుతుంది. ఆ సూక్ష్మశక్తుల ఆధారం లేకుండానే నీవు జగత్తులో నిండి ఉండి కూడా దానితో కలవకుండా ఉంటావు.

10.1-120-క.

సర్వము నీలోనిదిగా
సర్వాత్ముఁడ; వాత్మవస్తు సంపన్నుఁడవై
సర్వమయుఁడ వగు నీకును
సర్వేశ్వర! లేవు లోను సందులు వెలియున్.

టీక:- సర్వమున్ = సమస్త లోకములు; నీ = నీకు; లోనిదిన్ = లోపల ఉండునది; కాన్ = కాగా; సర్వాత్ముడవు = లోక మందున్నవాడవు {సర్వాత్ముడు - సకల భువనము లంతటి అందు ఉండువాడు, విశ్వరూపుడు}; ఆత్మవస్తుసంపన్నుఁడవు = లోకాతీతుడవు {ఆత్మ వస్తు సంపన్నుఁడు - ఆత్మ అనెడి వస్తువు యొక్క సమృద్ధి కలవాడవు, పరమాత్మ}; ఐ = అయ్యి; సర్వమయుడవు = లోకము ధరించినవాడవు {సర్వ మయుడు - సకల భువనములు కలిగినవాడు, విశ్వంభరుడు}; అగు = ఐన; నీ = నీ; కును = కు; సర్వేశ్వర = హరి {సర్వేశ్వరుడు - సమస్తమైన సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహములను పంచకృత్యములకును ప్రభువు, విష్ణువు}; లేవు = కలుగవు; లోను = లోపలయును; సందులు = మధ్యయును; వెలియున్ = బయటయును.

భావము:- సర్వమునకు ఈశ్వరుడైన భగవంతుడా! సర్వము నీ లోనే ఉంది; సర్వమునకు ఆత్మ

అయిన వాడవు నీవు; నీ చేత తయారైన వస్తువులతో సర్వము నిండి ఉన్నది; అట్టి నీకు లోపల, మధ్య, బయట అన్న భాదాలు లేవు.

10.1-121-ఆ.

ఆత్మ వలనఁ గలిగి యమరు దేహాదుల
నాత్మకంటె వేఱు లవి యటంచు
దలఁచువాఁడు మూఢతముఁడు గావునఁ నీశ!
విశ్వ మెల్ల నీవ వేఱు లేదు.

టీక:- ఆత్మ = పరమాత్మవైన నీ; వలనన్ = వలన; కలిగి = జన్మించి; అమరు = అమరి ఉండెడి; దేహ = శరీరము; ఆదులన్ = మున్నగువానిని; ఆత్మ = పరమాత్మ; కంటెన్ = కంటె; వేఱులు = భిన్నములైనవి; అవి = అవి; అట = అట; అంచున్ = అనుచు; తలచు = భావించెడి; వాడు = అతడు; మూఢతముడు = అత్యధికమైన మూఢుడు {మూఢుడు - మూఢతరుడు - మూఢతముడు}; కావునన్ = కనుక; ఈశ = నారాయణ {ఈశుడు - పంచకృత్యములకు నియామకుడు, విష్ణువు}; విశ్వము = సృష్టి; ఎల్లన్ = అంతయును; నీవ = నీవే; వేఱు = నీకు భిన్నమైనది; లేదు = లేనేలేదు.

భావము:- ఈశ్వరుడా! ఆత్మ నుండి శరీరం మనస్సు మొదలైనవి పుట్టు కొస్తాయి. వాటిని ఆత్మ కన్న వేరైనవి అనుకొనే వాడు పరమ మూర్ఖుడు. విశ్వమంతా నీవే. నీవు కానిది వేరే ఏమి లేదు.

10.1-122-వ.

అదియునుం గాక.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- అంతే కాకుండా.

10.1-123-సీ.

గుణము వికారంబుఁ గోరికయును లేని-

నీ వలన జగంబు నెఱి జనించుఁ;

బ్రబ్బు; లేదగు; నంచుఁ బలుకుట తప్పుగా-

దీశుండవై బ్రహ్మ మీవ యైన

నినుఁ గొల్చు గుణములు నీ యానతులు చేయ,-

భటులశౌర్యంబులు పతికి వచ్చు

పగిది నీ గుణముల బాగులు నీ వని-

తోఁచును నీ మాయతోడఁ గూడి

10.1-123.1-ఆ.

నీవు రక్త ధవళ నీల వర్ణంబుల

జగము చేయఁ గావ సమయఁ జూడఁ

దనరు; దట్లు నేఁడు దైత్యుల దండింపఁ

బృథివి గావ నవతరించి తీశ!

టీక:- గుణము = సత్వరజస్తమోగుణాలు; వికారంబున్ = జన్మనమృత్యాది మార్పులు; కోరికయున్ = కర్మానుష్ఠాన వాంఛలు; లేని = లేనట్టి; నీ = నీ; వలనన్ = వలన; జగంబున్ = భువనములు; నెఱిన్ = నిండుగా; జనించున్ = పుట్టును; ప్రబ్బున్ = వర్ధిల్లును; లేదగు = నశించును; అంచున్ = అనుచు; పలుకుట = చెప్పుట; తప్పు = అసత్యము; కాదు = కాదు; ఈశుండవు = సర్వనియామకుండవు; ఐ = అయ్యి; బ్రహ్మము = పరబ్రహ్మము; ఈవ = నీవే; ఐన = అయినట్టి; నినున్ = నిన్ను; కొల్చు = సేవించెడి; గుణములు = త్రిగుణములు; నీ = నీ యొక్క; ఆనతులు = ఉత్తరువులను; చేయన్ = చేయుచుండగా; భటుల = సైనికుల యొక్క; శౌర్యంబులున్ = పరాక్రమములు; పతి = ప్రభువున; కిన్ = కు; వచ్చు = చెందెడి; పగిదిన్ = విధముగనే; నీ = నీ యొక్క; గుణములు = గుణములు; బాగులు = మేళ్ళు; నీవి = నీకు చెందినవే; అని = అని; తోచును = అనిపించును; నీ = నీ యొక్క; మాయ = అవ్యక్తమహిమ; తోడన్ = తోటి; కూడి = చేరి.

నీవు = నీవు; రక్త = ఎఱ్ఱని, రజస్; ధవళ = తెల్లని, సత్వ; నీల = నల్లని, తమస్; వర్ణంబులన్ = రంగులచే,

గుణములతో; జగమున్ = ప్రపంచమును; చేయన్ = సృష్టించ; కావన్ = పాలించ; సమయన్ = లయములుచేయ; చూడన్ = పూని; తనరుదు = ఒప్పుచుండుదువు; అట్లు = ఆ విధముగ; నేడు = ఇవాళ; దైత్యులన్ = రాక్షసులను {దైత్యులు – దితి యొక్క సంతానము, రాక్షసులు}; దండింపన్ = శిక్షించుటకు; పృథివిన్ = భూమండలమును; కావన్ = కాపాడుటకు; అవతరించితివి = పుట్టితివి; ఈశ = నారాయణ {ఈశుడు – సర్వనియామకుడు, విష్ణువు};

భావము:– ప్రభువా! నీ వలన జగత్తు పుడుతుంది. అయితే ఆ జగత్తుకు అవసరమైన త్రిగుణాలు గాని, వాని మార్పులు గాని నీకు లేవు. సృష్టి చేయాలనే కోరిక కూడ నీకు లేదు. నీ వలననే పుట్టిన జగత్తు నీ వలననే వృద్ధిచెంది నీ యందే లయమౌతుంది అనడం పొరపాటు కాదు. సర్వాతీతుడవై, బ్రహ్మము అయిన నీవు తమ ప్రభువు అని నీ ఆజ్ఞను పరిపాలిస్తాయి. లోకంలో భటుల శౌర్యం ప్రభువు శౌర్యం అని ప్రసిద్ధికెక్కుతుంది. అలాగే నీ మాయతో కూడిన గుణాలు, వాని గొప్పదనాలు నీవిగా తోస్తాయి. నీవు రజోగుణ రూపుడవై సృష్టి చేస్తూ ఉన్నప్పుడు ఎఱ్ఱని రంగుతో కూడి ఉంటావు. సత్త్వగుణ రూపుడవై సృష్టిని రక్షిస్తూ ఉన్నప్పుడు తెల్లని రంగుతో కూడి ఉంటావు. తమోగుణ రూపుడవై సృష్టిని లయంచేస్తూ ఉన్నప్పుడు నల్లని రంగుతో కూడి ఉంటావు. ఇవన్నీ నీవు ధరించే పాత్రలు. అలాగే ఇవాళ కూడ దుష్టులను దండించడానికి భూమి పై మానవుడుగా అవతరించావు.

10.1-124-శా.

మింటన్ మ్రోసిన మ్రోత తాలిమిని లోమేండ్రింప మున్ నీవు నా
యింటం బుట్టెద వంచుఁ గంసుడు దొడిన్ హింసించె నీ యన్నలం;
గంటం గూరుకుఁ దేఁడు; నీ యుదయ మా కారాజనుల్ చెప్పగాఁ
బంటింపం; డెదురేఁగుదెంచు వడి నీపై నేఁడు సన్నద్ధుఁడై."

టీక:– మింటన్ = ఆకాశమున, ఆకాశవాణి; మ్రోసిన = పలికిన; మ్రోత = పలుకులు; తాలిమిని = నిబ్బరమును; లోన్ = లోపల; మేండ్రింప = నశింపజేయగా; మున్ = పూర్వము; నీవున్ = నీవు; నా = నా యొక్క; ఇంటన్ = కడుపున; పుట్టెదవు = జన్మించెదవు; అంచున్ = అనుచు; కంసుడు = కంసుడు; తొడిన్ = ఒకరి తరువాత ఒకరిని; హింసించెన్ = చంపెను; నీ = నీ; అన్నలన్ = ముందు పుట్టిన వారిని; కంటన్ = కంటిమీదకు; కూరుకున్ = నిద్రను; తేడు = తెచ్చుకోడు; నీ = నీ యొక్క; ఉదయము = అవతరించుట; ఆ = అక్కడి; కారాజనులు = చెరసాల కాపలావారు; చెప్పగాన్ = చెప్పగానే; పంటింపడు = ఉపేక్షింపడు; ఎదురు = ఎదుర్కొనుటకు; ఏగుదెంచున్ = వచ్చును; వడిన్ = శ్రీఘ్రముగ; నీ = నీ; పై = మీదకు; నేడు = ఇవాళ; సన్నద్ధుడు = సిద్ధపడినవాడు;

ఐ = అయ్యి.

భావము:- ఆకాశవాణి మాటలు కంసుని ధైర్యాన్ని కూలద్రోశాయి. ఆనాటి నుండి నువ్వు నా యింట పుట్టబోతున్నావని భయపడి, వాడు నీ అన్నలను అందరిని సంహరించాడు. ఇప్పుడు నువ్వు పుట్ట బోతున్నా వని తెలిసి కంటికి కునుకు లేకుండ ఉన్నాడు. నువ్వు పుట్టావని కారాగార భటులు చెప్తే తాత్సారం చేయడు. వెంటనే నీ మీదకి విరుచుకు పడటానికి సిద్ధమై వచ్చేస్తాడు."

10.1-125-వ.

అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సుకుమారుం డును నైన కుమారునిం గని, కంసునివలని వెఱపున శుచిస్మితయై యిట్లనియె.

టీక:- అనుచుండన్ = అని పలుకుతుండగా; దేవకీ = దేవకి అనెడి; దేవి = ఉత్తమురాలు; మహాపురుష = మహాపురుషుల యొక్క {మహాపురుషలక్షములు - సాముద్రిక శాస్త్రమున చెప్పబడిన శంఖ చక్ర వజ్ర పద్మ హలాది చిహ్నములు}; లక్షణుండును = లక్షణములు కలవాడు; విచక్షణుండును = జ్ఞాని నేర్పరి ఐనవాడు; సుకుమారుండును = కోమల దేహము కలవాడు; ఐన = అయిన; కుమారునిన్ = పుత్రుని; కని = కనుగొని, ఉద్దేశించి; కంసుని = కంసుని; వలని = మూలమున; వెఱపునన్ = బెదురుతో; శుచి = స్వచ్ఛమైన; స్మిత = చిరునవ్వు కలామె; ఐ = అయ్యి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా వసుదేవుడు అంటూ ఉండగా, దేవకీదేవి కొడుకును చూసింది. అతడు మహాపురుషుల సాముద్రిక లక్షణాలు కలిగి ఉన్నాడు. అతడు చక్కని చూపులు కలవాడు, చాలా సుకుమారుడు అయ్యి ఉన్నాడు. కంసుని పేరు వినబడగానే దేవకీదేవి భయపడింది. శుచి అయి చక్కటి చిరునవ్వు కలది అయి ఆ దేవదేవుని వంక చూసి ఇలా అంది.

## దేవకి చేసిన స్తుతి

10.1-126-సీ.

"అట్టిట్టి దనరానిదై మొదలై నిండు-
కొన్నదై వెలుఁగుచు గుణములేని
దై యొక్క చందంబుదై కలదై నిర్వి-
శేషమై క్రియలేక చెప్పరాని

దేరూపమని శ్రుతు లెప్పుడు నొడివెడి-
　యా రూప మగుచు నధ్యాత్మదీప
మై బ్రహ్మ రెండవ యర్థంబు తుది జగం-
　బులు నశింపఁగఁ బెద్దభూతగణము

10.1-126.1-ఆ.

సూక్ష్మభూతమందుఁ జొరఁగ నా భూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి పోయి
వ్యక్తమందుఁ జొరఁగ వ్యక్త మడంగను
శేషసంజ్ఞ నీవు చెలువ మగుదు.

టీక:- అట్టిది = అలాంటిది; ఇట్టిది = ఇలాంటిది; అనన్ = అనుటకు; రాని = వీలుకాని; మొదలు = మూలకారణము; ఐ = అయ్యి; నిండుకొన్నది = అంతటను వ్యాపించినది; ఐ = అయ్యి; వెలుగుచున్ = ప్రకాశించుచు; గుణము = త్రిగుణా; లేనిది = అతీతమైనది; ఐ = అయ్యి; ఒక్కచందంబు = నిర్వికారము కలది {ఒక్కచందము కలది - ఎప్పటికిని ఒకే విధముగా ఉండునది, షడ్భావవికారములు లేనిది}; ఐ = అయ్యి {షడ్వికారములు - 1ఆకలి 2దప్పిక 3శోకము 4మోహము 5ముసలితనము 6చావు}; కలది = శాశ్వతముగ నుండునది; ఐ = అయ్యి; నిర్విశేషము = ఇంద్రియవిషయలు లేనిది; ఐ = అయ్యి; క్రియ = కర్మవాసన గల పనులు; లేక = లేనిదై; చెప్పన్ = నోటితో వివరించుటకు; రానిది = వీలుకానిది; ఏ = ఎట్టి; రూపము = స్వరూపము; అని = అని; శ్రుతులు = వేదములు; ఎప్పుడున్ = ఎల్లప్పుడు; నొడివెడి = చెప్పెడి; ఆ = అట్టి; రూపము = స్వరూపము గలది; అగుచున్ = ఔతూ; అధ్యాత్మ = ఆత్మవిషయ జ్ఞానమును; దీపము = ప్రకాశింపజేయునది; ఐ = అయ్యి; బ్రహ్మ = బ్రహ్మదేవుని; రెండవయర్థంబు = ద్విపరార్థమున, శ్వేతవరాహాది కల్పములు; తుదిన్ = చివరకు; జగంబులున్ = అఖిల లోకములు; నశింపన్ = లయమైపోగా (మహాప్రళయము); పెద్దభూతగణము = పంచమహాభూతములు {పంచమహాభూతములు - భూజలాగ్ని వాయువ్యాకాశములు}.

సూక్ష్మభూతము = భూతాదియైన అహంకారము; అందున్ = లో; చొరగన్ = లయముకాగా; ఆ = ఆ; భూతంబు = అహంకారము; ప్రకృతి = మహతత్త్వము; లోనన్ = అందు; చొరగన్ = లయముకాగా; ప్రకృతి = ప్రకృతి; పోయి = నశించి; వ్యక్తము = అయవ్యక్తతత్వము; అందున్ = లో; చొరగన్ = లయముకాగా; వ్యక్తము = అయవ్యక్తతత్వము; అడంగును = నశించును; శేష = శేషుడు అనెడి; సంజ్ఞన్ = పేరుతో; నీవున్ = నీవు; చెలువము = ఒప్పువాడవు;

అగుదు = అయ్యెదవు.

భావము:- "బ్రహ్మదేవుని ఆయుర్దాయంలో రెండవ సగం పూర్తైన పిమ్మట స్థూలమైన పంచమహాభూతాలు అహంకార మనే సూక్ష్మ భూతంలో లీనమవుతాయి. అది మూల ప్రకృతిలో లీనమౌతుంది. ఆ మూల ప్రకృతి వ్యక్తతత్వం లోనికి లీనమౌతుంది. ఆ వ్యక్తతత్వం కూడ లీనమైన తరువాత శేషుడవై నీవు నిలబడి ఉంటావు. అట్టి నీ తత్వం అలాంటిది ఇలాంటిదని వివరించడానికి వీలుకానిది. అదే అన్నిటికి మూలం. అన్నిటా అదే నిండి ప్రకాశిస్తుంటుంది. గుణాలకు అతీతమైనది. ఏకైక తత్త్వంగా నిలబడి ఉంటుంది. అది కాక వేరుగా శేషించినది ఏమీ ఉండదు. దాని రూపం ఇలా ఉంటుంది అని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే అది సర్వ క్రియా స్వరూపమైనది. వేదాలు ఆ తత్త్వాన్ని గురించే సర్వత్రా గానం చేస్తూ ఉంటాయి. ఆత్మను అధిష్ఠించి, దానికి ఆధారంగా నిలబడే జ్యోతి అది. అది నీవే.

10.1-127-ఉ.

విశ్వము లీల ద్రిప్పుచు నవిద్యకు జుట్టమ వైన నీకు దా
శాశ్వతమైన కాలమిది సర్వము వేడబమందు; రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెవ్వఁడుఁ గోరి భజించు వాడె పో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుం డభయుండు మాధవా!

టీక:- విశ్వము = ప్రపంచమును; లీలన్ = క్రీడగా; త్రిప్పుచున్ = నడిపించుచు (సృష్టిస్థితిలయల); అవిద్య = మాయ; కున్ = కు; చుట్టమవు = సంబంధించినవాడవు; ఐన = అయినట్టి; నీ = నీ; కున్ = కు; తాన్ = తను; శాశ్వతము = ఎప్పటికి ఉండునది; ఐన = అయినట్టి; కాలము = కాలము; ఇది = ఇది; సర్వమున్ = సమస్తము; వేడబము = మాయ; అందురు = అంటారు; అట్టి = అటువంటి; విశ్వేశ్వర = ప్రపంచమునకు కర్తా; మేలు = శుభములకు; కుప్ప = రాశి ఐనవాడ; నినున్ = నిన్ను; ఎవ్వడున్ = ఎవరైతే; కోరి = ఇచ్ఛపూర్వకముగా; భజించున్ = సేవించునో; వాడెపో = అతడు మాత్రమే; శాశ్వత = ఎన్నడు చెడని; లక్ష్మి = సంపదలు; మృత్యు = మరణమునుండి; జయ = జయము; సౌఖ్య = సుఖములతో; యుతుండు = కూడినవాడు; అభయుండు = భయము లేని వాడు; మాధవా = నారాయణా {మాధవుడు - మా (లక్ష్మీదేవి)కి ధవుడు (భర్త), మాధవి యొక్క భర్త, విష్ణువు}.

భావము:- విశ్వేశ్వరా! సమస్తమైన శుభాలకు (మేలు కు బహువచనం మేళ్ళు - శుభములు)

నిధానమా! లక్ష్మీదేవిభర్తవైన నీవు ఈ విశ్వాన్ని అంతటిని నీ లీలలతో ప్రవర్తింప జేస్తుంటావు. దానికి ఆధారమైన అవిద్య అనెడి మాయకు నీవు దగ్గరి బంధువవు. ఈ శాశ్వతమైన అనంతమైన కాలం యావత్తు నీవు నడిపించే మాయ. ఇలా శాశ్వతమైన కాలాన్ని ప్రవర్తింపజేస్తూ జగత్తులకు మేలు చేకూర్చే నిన్ను కోరి ఆరాధించేవాడు వివేకి. వాడే సమస్త శాశ్వతమైన లక్ష్మీకళలను, సుఖాన్ని, మృత్యుంజయాన్ని పొందినవాడు అవుతాడు.

10.1-128-మత్త.

ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
"కంటి"మందురు గాని, నిక్కము గాన; రీ భవదాకృతిం
గంటి భద్రముఁ గంటి; మాంసపుఁ గన్నులం గనబోల; దీ
తొంటిరూపుఁ దొలంగఁబెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్.

టీక:- ఒంటిన్ = నిర్మానుష్య స్థలము అందు; నిల్చి = ఉండి; పురాణ = పురాతన {పురాణ యోగులు - సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది మహర్షులు}; యోగులు = ఋషులు; యోగమార్గ = యోగవిధానమున; నిరూఢులు = మిక్కిలి నేర్పరులు; ఐ = అయ్యి; కంటిమి = దర్శించితిమి; అందురు = అంటారు; కాని = తప్పించి; నిక్కమున్ = సత్యమునకు; కానరు = చూడలేరు; ఈ = ఈ; భవత్ = నీ యొక్క; ఆకృతిన్ = స్వరూపమును; కంటిన్ = చూడగలిగితిని; భద్రమున్ = శుభములను; కంటిన్ = పొందితిని; మాంసపుకన్నులన్ = చర్మచక్షువులతో; కనన్ = చూచుటకు; పోలదు = సాధ్యము కాదు; ఈ = ఈ; తొంటి = ఆది; రూపున్ = స్వరూపమును; తొలంగబెట్టుము = తొలగింపజేయుము; తోయజేక్షణ = నారాయణా {తోయజేక్షణుడు - తోయజము (తెల్లతామరల)లవంటి కన్నులు కలవాడు, విష్ణువు}; మ్రొక్కెదన్ = నమస్కరించెదను.

భావము:- పద్మాక్షా! ప్రాచీనకాలం నుంచీ మహాయోగీశ్వరులు ఒంటరిగా యోగమార్గంలో అత్యంత తీవ్ర సాధన చేసి నిన్ను చూసాము అంటారు. కాని వారు చూసింది తాము చూడదలచిన రూపాన్నే కాని నీవు అనుగ్రహించే ఈ రూపాన్ని కాదు. నీవు దర్శన మిచ్చిన నీ ఈ రూపాన్ని భద్రంగా చూసి తరించాను ప్రభు. ఈ భౌతికమైన కన్నులతో నీ ఈ దివ్యరూపాన్ని చూడడం కష్టంగా ఉంది. నీకు నమస్కరిస్తాను. సర్వస్వానికి ఆధారమైన ఈ నీ స్వస్వరూపాన్ని ఉపసంహరించు.

10.1-129-తే.

విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద
కడుపులోన దాఁచు కడిమి మేటి
నటుఁడ వీవు; నేఁడు నా గర్భజుఁడ వౌట
పరమపురుష! వేడబంబు గాదె?

టీక:- విలయ = ప్రళయ; కాలము = సమయము; అందున్ = లో; విశ్వంబున్ = భువనములను; నీ = నీ యొక్క; పెద్ద = పెద్ద; కడుపు = గర్భము; లోనన్ = అందు; దాచు = దాచెడి; కడిమి = సమర్థుడవైన; మేటి = శ్రేష్ఠుడవైన; నటుడవు = నడిపించెడివాడవు; ఈవు = నీవు; నేడు = ఇవాళ; నా = నా యొక్క; గర్భజుడవు = కడుపున పుట్టిన వాడవు; ఔట = అగుట; పరమపురుష = నారాయణా {పరమ పురుషుడు - అత్యున్నతమైన కారణభూతుడు, పురుషోత్తముడు, విష్ణువు}; వేడబంబు = మాయే; కాదే = కాదా, అవును.

భావము:- సృష్టి అంతా ప్రళయంలో లీనమైపోయినప్పుడు ఈ సమస్తమైన విశ్వాన్ని కడుపులో దాచుకొన సమర్థుడవైన మహా నటుడవు. అలాంటి పరమ పురుషుడవు నీవు నా కడుపున పుట్టడం నీ మాయ మాత్రమే కదయ్యా! నారాయణా!

10.1-130-త.

నళినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ
ఖలుఁడు కంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె; దు
ర్మలినచిత్తుని నాజ్ఞజేయుము; మమ్ముఁ గావుము భీతులన్;
నులుసు లేక ఫలించె నోచిన నోము లెల్లను నీవయై."

టీక:- నళినలోచన = నారాయణా {నళిన లోచనుడు - పద్మాక్షుడు, హరి}; నీవున్ = నీవు; నిక్కమున్ = నిజముగా; నా = నా; కున్ = కు; పుట్టెదవు = జన్మించెదవు; అంచున్ = అనుచు; ఈ = ఈ; ఖలుడు = దుష్టుడు; కంసుడు = కంసుడు; పెద్ద = చాలా; కాలము = కాలము నుండి; కారయింటన్ = చెరసాలలో; అడంచెన్ = అణచివేసెను; దుర్మలిన = చెడ్డపాపపు; చిత్తున్ = బుద్ధి కలవానిని; ఆజ్ఞజేయుము = శిక్షింపుము; మమ్మున్ = మమ్ములను; కావుము = కాపాడుము; భీతులన్ = బెదిరిపోయినవారము; నులుసు = ఏ లోపము, న్యూనత; లేక = లేకుండగ; ఫలించెన్ = ఫలించినవి; నోచిన = నిష్ఠగా ఆచరించిన; నోములు = వ్రతములు; ఎల్లను = అన్నియును;

నీవున్ = నీవు; ఐ = కలుగుట అయ్యి.

భావము:– కమలదళాలలాంటి చక్కని కన్నులు గల ఓ ప్రభూ! నీవు నా కడుపున పుట్ట బోతున్నావని విని, దుర్మార్గుడు కంసుడు చాలాకాలంగా మమ్మల్ని ఇలా జైలులో పెట్టి బాధ పెడ్తున్నాడు. మలిన చిత్తంతో మసలుతున్న వాడిని శిక్షించు. భయభ్రాంతులము అయిన మమ్ము రక్షించు. నీ పుట్టుకతో మేము నోచిన నోములు అన్నీ లోటు లేకుండ పరిపూర్ణంగా పండాయి స్వామీ." అని చెప్పుకొంది దేవకీదేవి.

# దేవకీ వసుదేవుల పూర్వజన్మ

10.1-131-వ.

అని యిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుం డిట్లనియె; “నవ్వా! నీవు తొల్లి స్వాయంభువ మన్వంతరంబున పృశ్ని యను పరమపతివ్రతవు; వసుదేవుఁడు సుతపుఁ డను ప్రజాపతి; మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మపంపునం, బెంపున నింద్రియంబులం జయించి తెంపున వాన గాలి యెండ మంచులకు సైరించి యేకలములై యాకలములు దిని యే కలంకంబును లేక వేండ్రంబుగఁ బండ్రెండువేల దివ్యవర్షంబులు తపంబులఁ జేసిన నెపంబున మీ రూపంబులు మెఱయ యోజనాజపంబులు జేసి, డాసి, పేర్చి, యర్చింప మీకు నాకుఁ గలరూపుఁ జూపి యేను "దిరంబులగు వరంబులు వేఁడుఁ"డనిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలు లేని దొడ్డయడ్డంబున దుర్దమం బగు నపవర్గంబుఁ గోరక నా యీడు కొడుకు నడిగిన మెచ్చి యట్ల వరం బిచ్చి మీ కేను "పృశ్నిగర్భుం"డను నర్భకుండ నయితి; మఱియును.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; దేవకీ = దేవకి అనెడి; దేవి = ఉత్తమురాలు; విన్నవించినన్ = మనవిచేయగా; ఈశ్వరుండు = విష్ణుమూర్తి; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను; అవ్వా = అమ్మా; నీవున్ = నీవు; తొల్లి = పూర్వకాలపు; స్వాయంభువ = స్వాయంభువుడను; మన్వంతరంబునన్ = మనువు కాలము నందు; పృశ్ని = పృశ్ని; అను = అను పేరుగల; పరమ = అత్యుత్తమ; పతివ్రతవు = పతివ్రతవు; వసుదేవుడు = వసుదేవుడు; సుతపుడు = సుతపుడు; అను = అనెడి; ప్రజాపతి = ప్రజాపతి; మీరు = మీరు; ఇరువురును = ఇద్దరు (2); సృష్టికాలంబు = సృష్ట్యారంభకాలమున; బ్రహ్మ = బ్రహ్మదేవుని; పంపునన్ = ఆజ్ఞమీది; పెంపునన్ = గౌరవముతో; ఇంద్రియంబులన్ = ఇంద్రియములను; జయించి = లొంగదీసుకొని; తెంపునన్ = తెగువతో; వాన = వర్షములు; గాలి = వాయువులు; ఎండ = ఎండలు; మంచుల = మంచుల; కున్ = కు; సైరించి = ఓర్చుకొని; ఏకలములు = ఏకాంతులు, కూడినవారు; ఐ = అయ్యి; ఆకు = ఆకులు; ఆలములు = అలములు; తిని = ఆహారముగా తీసుకొని; ఏ = ఎట్టి; కలంకంబున్ = సందేహము; లేక = లేకుండగ; వేండ్రంబుగన్ = తీక్షణముగ; పండ్రెండువేల =

పన్నెండువేల (12,000); దివ్యవర్షంబులు = దివ్యసంవత్సరములు; తపంబులున్ = తపస్సులు; నెపంబునన్ = అనెడి మిషలతో; మీ = మీ యొక్క; రూపంబులున్ = ఆకృతుల తేజస్సులు; మెఱయన్ = కాంతివంతముకాగా; ఓజన్ = క్రమముగా; నా = నా యొక్క; జపంబులున్ = జపములను; చేసి = ఆచరించి; డాసి = చేరి; పేర్చి = అతిశయించి; అర్చింపన్ = సేవించగా; మీ = మీ; కున్ = కు; నాకుగల = నా యొక్క; రూపుజూపి = సాక్షాత్కారమిచ్చి; ఏను = నేను; తిరంబులు = స్థిరములు; అగు = ఐన; వరంబులు = కోరికలు; వేడుడు = కోరుకొనుడు; అనినన్ = అనగా; మీరు = మీరు; నా = నా యొక్క; మాయన్ = మాయను; పాయని = తొలగని; మోహంబునన్ = మోహమువలన; బిడ్డలు = సంతానము; లేని = లేనట్టి; దొడ్డ = పెద్ద; అడ్డంబునన్ = ఇబ్బందివలన; దుర్గమంబు = పొందరానిది; అగు = ఐన; అపవర్గంబున్ = మోక్షమును; కోరకన్ = కోరుకొనకుండగ; నా = నాకు; ఈడు = సమానమైన; కొడుకున్ = పుత్రుని; అడిగినన్ = కోరుకొనగా; మెచ్చి = మెచ్చుకొని; అట్ల = ఆ విధముగనే; వరంబున్ = వరమును; ఇచ్చి = ప్రసాదించి; మీ = మీ; కున్ = కు; ఏను = నేను; పృశ్నిగర్భుండు = పృశ్నికి పుట్టినవాడు {అన్నం, నీరు, వేదం మొదలైన సమస్తం తన గర్భంలోనే ఉంటాయి కనుక దేవుడే పృశ్నిగర్భుడు. పృశ్ని అంటే కిరణం. - పారమార్థిక పదకోశం 2010 (పాత్తూరి వేంకటేశ్వరరావు)} ; అను = అనెడి; అర్భకుండను = పిల్లవాడను; ఐతి = అయితిని; మఱియును = ఇంకను.

భావము:- ఇలా దేవకీదేవి విన్నవించగా, విష్ణుమూర్తి "అమ్మా! పూర్వం స్వాయంభువ మన్వంతరంలో "పృశ్ని" అనే మహాపతివ్రతవు నువ్వు, అప్పుడు "సుతపుడు" అనే ప్రజాపతి వసుదేవుడు. మీరిద్దరు సృష్టికాలంలో బ్రహ్మదేవుని ప్రేరణతో మహా తపస్సు చేసారు. ఇంద్రియాలను జయించారు. గాలి, వాన, ఎండ, చలి మొదలైన వానిని సహించారు. ఏకాంతగా ఉంటూ ఆకులు అలములు తిని తీవ్రమైన తపస్సు చేసారు. అలా పన్నెండువేల దివ్యసంవత్సరాలు తపస్సు చేయగా మీ రూపాలు కాంతివంత మైనాయి. అలా నిష్ఠగా నా నామజపం చేయగా నా తత్వాన్ని సమీపించగలిగారు. నన్ను బహునిష్ఠగా పూజించారు. అప్పుడు నా సత్యరూపదర్శనం ఇచ్చి, మంచి వరాలు కోరుకో మన్నాను. అప్పటికి మీకు పిల్లలు లేరు. అయితే ఆ సమయంలో నా మాయ మిమ్మల్ని ఆవహించింది. కనుక మోహంతో తిరుగులేని మోక్షం కోరుకోకుండా నాతో సాటి యైన కొడుకును ప్రసాదించ మని వరం కోరుకొన్నారు. నేను మెచ్చి అలాగే వర మిచ్చాను. నా సాటి వేరొకడు లేడు కనుక నేనే మీకిద్దరికి "పృశ్నిగర్భుడు" అనే పేరుతో కొడుకుగా పుట్టాను.

10.1-132-క.

అదితియుఁ గశ్యపుఁ డనగా
విదితుల రగు మీకుఁ గుఱుచవేషంబున నే
నుదయించితి "వామనుఁ"డన
ద్రిదశేంద్రానుజుడనై ద్వితీయభవమునన్

టీక:- అదితియున్ = అదితి; కశ్యపుడు = కశ్యపుడు; అనగా = అనగా; విదితులరు = తెలియబడినవారు; అగు = ఐన; మీ = మీ; కున్ = కు; కుఱుచ = పొట్టివాని; వేషంబునన్ = ఆకృతితో; నేన్ = నేను; ఉదయించితిన్ = అవతరించితిని; వామనుడు = వామనుడు; అనన్ = అనగా; త్రిదశేంద్ర = దేవేంద్రునికి {త్రిదశేంద్రుడు - త్రిదశు (దేవత)ల ఇంద్రుడు, దేవేంద్రుడు}; అనుజుండను = సోదరుడను, తమ్ముడను; ఐ = అయ్యి; ద్వితీయ = రెండవ (2); భవమునన్ = జన్మమునందు.

భావము:- రెండవ జన్మలో మీరు "అదితి", "కశ్యపుడు"అనే పేర్లు గల ప్రసిద్ధ మైన దంపతులు. అప్పుడు నేను మరుగుజ్జు రూపంతో "వామనుడు"అనే పేరుతో మీకు జన్మించాను

10.1-133-క.

ఇప్పుడు మూఁడవ బాముని
దప్పక మీ కిరువురకునుఁ దనయుఁడ నైతిం
జెప్పితిఁ బూర్వము మీయం
దెప్పటికిని లేదు జన్మమిటపై నాకున్

టీక:- ఇప్పుడు = ప్రస్తుతము; మూడవ = మూడవ (3); బామునన్ = జన్మము నందు; తప్పకన్ = విడువకుండ; మీ = మీ; కున్ = కు; ఇరువుర = ఇద్దర (2); కునున్ = కు; తనయుడను = పుత్రుడను; ఐతిన్ = అయినాను; చెప్పితిన్ = తెలియజెప్పితిని; పూర్వము = ఇంతకుముందే; మీ = మీ; అందున్ = కు; ఎప్పటికిని = ఎప్పటికి; లేదు = ఉండదు; జన్మము = పునర్జన్మము; ఇట = ఇక; పై = మీదట; నా = నా; కున్ = కు.

భావము:- పూర్వం నేను చెప్పనట్లుగానే మూడవ జన్మలో ఇప్పుడు మీ దంపతులకు పుత్రుడుగా జన్మించాను. ఇకపై మీ యందు నాకు పుట్టుక లేదు.

10.1-134-క.

నందనుఁ డనియుం బరమా
నందంబగు బ్రహ్మ మనియు ననుఁ దలచుచు నా
పెందెరువు నొందెదరు; నా
యందలి ప్రేమమున భవము నందరు మీరల్"

టీక:- నందనుడు = పుత్రుడు; అనియున్ = అని; పరమానందము = మిక్కిలి ఆనందము; అగున్ = కలుగును; బ్రహ్మము = పరబ్రహ్మము; అనియున్ = అని; ననున్ = నన్ను; తలచుచున్ = భావించుచు; నా = నాకు చెందిన; పెందెరువున్ = పరమపదమును {పెందెరువు - పెంపు (ఉత్కృష్టమైన) తెరువు (దారి), పరమపదము}; ఒందెదరు = పొందెదరు; నా = నా; అందలి = ఎడల; ప్రేమమునన్ = భక్తివలన; భవమున్ = పునర్జన్మను; అందరు = పొందరు; మీరల్ = మీరు.

భావము:- నన్ను మీరు కుమారుడని తలచుకుంటు ఉంటారు. ఇప్పుడు నేను అనుగ్రహించిన దర్శనం వలన పరమానంద స్వరూపుడైన "పరబ్రహ్మము"నేనే అని అనుకుంటూ ఉంటారు. ఆ నిరంతర స్మరణ వలన నా అద్భుతమైన లోకాన్ని పొందుతారు. నా యందు మీకున్న ప్రేమ వలన ఇకపై మీరు జన్మ ఎత్తరు."

## కృష్ణుడు శిశురూపి యగుట

10.1-135-వ.

అని యిట్లు పలికి యీశ్వరుం డా రూపంబు విడిచి.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; పలికి = చెప్పి; ఈశ్వరుండు = శ్రీహరి; ఆ = ఆ; రూపంబున్ = ఆకృతిని; విడిచి = వదలివేసి.

భావము:- ఈ విధంగా చెప్పిన పిమ్మట విష్ణుమూర్తి ఆ బృహద్రూపాన్ని విడిచి పెట్టాడు.

10.1-136-క.

ఱెప్ప లిడక తలిదండ్రులు

తప్పకఁ దనుఁ జూడ మాయఁ దనరి లలితుఁడై

యప్పు డటు గన్న పాపని

యొప్పున వేడుకలు జేసె నొకకొన్ని నృపా!

టీక:- ఱెప్పలు = కనురెప్పలు; ఇడకన్ = మూయకుండగ; తల్లిదండ్రులు = తల్లిదండ్రులు; తప్పకన్ = విడువకుండగ; తనున్ = అతనిని; చూడన్ = చూచుచుండగా; మాయన్ = మహిమతో; తనరి = అతిశయించి; లలితుడు = మిక్కిలి కోమలుడు; ఐ = అయ్యి; అప్పుడ = అప్పుడే; అటు = అలా; కన్న = ప్రసవించబడిన; పాపని = బిడ్డ; ఒప్పునన్ = వలె; వేడుకలు = వినోదపు చేష్టలు; చేసెన్ = చేసెను; ఒక = ఒకానొక; కొన్ని = కొన్ని; నృపా = రాజా.

భావము:- పరీక్షిన్మహారాజా! ఈ విధంగా విష్ణుమూర్తి చెప్పిన పిమ్మట. దేవకీవసుదేవులు ఆశ్చర్యచకితులై కన్నార్పకుండ చూస్తుండగా హరి, మాయను ఆవరింపజేసుకొని ఆ దివ్య రూపాన్ని వదలి, అప్పుడే పుట్టిన పసిబిడ్డ రూపం ధరించాడు. కేరుకేరు మనడం లాంటి కొన్ని వేడుకలు చేసాడు.

## కృష్ణుని వ్రేపల్లెకు తరలించుట

10.1-137-వ.

అంత వసుదేవుండు దనకుం జేయవలసిన పను లీశ్వరుండైన హరివలన నెఱింగిన వాడు గావున.

టీక:- అంత = అంతట; వసుదేవుండు = వసుదేవుడు; తన = అతని; కున్ = కు; చేయవలసిన = పూర్తిచేయవలసిన; పనులు = కార్యములు; ఈశ్వరుండు = భగవంతుడు; ఐన = అయినట్టి; హరి = విష్ణుమూర్తి; వలనన్ = వలన; ఎఱింగిన = తెలుపబడిన; వాడు = వాడు; కావునన్ = కనుక.

భావము:- అప్పుడు వసుదేవుడు తాను చేయ వలసిన పనులను శ్రీహరి సంకల్పం వలన గ్రహించాడు. కనుక.

10.1-138-క.

ఆ పురిటి యిల్లు వెలువడి

పాపనిఁ దరలించుకొనుచుఁ బఱచెద ననుచున్

రూపింప నందుభార్యకుఁ

బాప యగుచు యోగమాయ ప్రభవించె నృపా!

టీక:- ఆ = ఆ; పురిటి = ప్రసవము జరిగిన; ఇల్లు = నివాసమును; వెలువడి = బయటపడి; పాపనిన్ = చంటిపిల్లవానిని; తరలించుకొనుచున్ = తీసుకొని పోతూ; పఱచెదను = వేగముగా వెళ్ళెదను; అనుచున్ = అని భావించుచు; రూపింపన్ = నిశ్చయించుకొనగా; నందు = నందుని యొక్క; భార్య = భార్య; కున్ = కు; పాప = బిడ్డ; అగుచున్ = ఔతు; యోగమాయ = యోగమాయాదేవి; ప్రభవించెన్ = పుట్టెను; నృపా = రాజా.

భావము:- పరీక్షిత్తు మహారాజా! అప్పుడు శిశురూపి అయిన విష్ణుని తీసుకొని, పురిటిల్లు దాటించి త్వరత్వరగా తీసుకుపోవాలని గ్రహించాడు. అదే సమయంలో వ్రేపల్లె లోని నందుని భార్య యశోదాదేవి యోగమాయను ఆడబిడ్డగా ప్రసవించింది.

10.1-139-వ.

అ య్యవసరంబున

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు.

భావము:- ఆ సమయంలో

10.1-140-క.

బిడ్డనిఁ గరముల ఔొమ్మున

నడ్డంబుగ బట్టి పదము లల్లన యిడుచున్

జడ్డనఁ గావలి వారల

యొడ్డు గడచి పురిటిసాల యొయ్యన వెడలెన్.

టీక:– బిడ్డని = చంటిపిల్లవానిని; కరములన్ = చేతులతో; ఱొమ్మునన్ = వక్షస్థలమున; అడ్డంబున్ = అడ్డముగా; పట్టి = పట్టుకొని; పదములు = అడుగులు; అల్లనన్ = మెల్లగా; ఇడుచున్ = వేయుచు; జడ్డనన్ = తటాలున; కావలి = కాపలా; వారలన్ = వాళ్ళ యొక్క; ఒడ్డు = అడ్డమును; గడచి = దాటి; పురిటిసాలన్ = ప్రసవగృహమును; ఒయ్యనన్ = చటుక్కున; వెడలెన్ = బయటపడెను.

భావము:– అప్పుడు, వసుదేవుడు పసిబిడ్డను చక్కగా చేతులతో ఎత్తుకొని, రొమ్ముకు అడ్డంగా హత్తుకొన్నాడు. చప్పుడు చేయకుండ మెల్ల మెల్లని అడుగలు వేస్తూ, గభాలున కావలి వాళ్ళు ఉండే ఆవరణ దాటాడు. చటుక్కున పురిటిల్లు నుంచి బయట పడ్డాడు.

10.1-141-వ.

అంత నట.

టీక:– అంతన్ = అప్పుడు; అట = అక్కడ.

భావము:– అక్కడ, వ్రేపల్లెలో.

10.1-142-క.

నందుని సతికి యశోదకుఁ

బొందుగ హరి యోగమాయ పుట్టిన మాయా

స్పందమున నొక్క యెఱుఁగమి

క్రందుకొనియె నూరివారిఁ గావలివారిన్.

టీక:– నందుని = నందుని యొక్క; సతి = భార్య; కిన్ = కి; యశోద = యశోద; కున్ = కు; పొందుగన్ = చక్కగా; హరి = విష్ణుమూర్తి యొక్క; యోగమాయ = యోగమాయాదేవి; పుట్టినన్ = జన్మించగా; మాయా = మాయ యొక్క; స్పందమునన్ = ప్రభావము వలన; ఒక్క = ఒకానొక విధమైన; ఎఱుగమి = మైకము; క్రందుకొనియెన్ = కమ్ముకొనెను; ఊరి = వ్రేపల్లెలోని; వారిన్ = వారిని; కావలి = కాపలా; వారిన్ = వాళ్ళను.

భావము:– అక్కడ, నందుడి భార్య యశోదకి యోగమాయ చక్కగా పుట్టింది. వెంటనే ఆ వ్రేపల్లెలో ఊరివారిని, కావలివారిని అందరిని విష్ణుమాయ ఆవరించి చిత్రమైన మైకం కమ్మింది.

10.1-143-వ.

అప్పుడు చప్పుడు కాకుండఁ దప్పుటడుగు లిడుచు, నినుప గొలుసుల మెలుసులు వీడిన దాలంబులు మహోత్తాలుండైన బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడిపడ, నరళంబులు విరళంబు లయిన సరళంబులగు మొగసాలలం గడచి, పాఁపఱేఁడు వాకిళ్ళు మరల మూయుచుఁ బడగ లెడగలుగ విప్పి, కప్పి, యేచి, కాచికొని వెంట నంటి రాఁగ దూఁగి నడచునెడ.

టీక:- అప్పుడు = ఆ సమయమునందు; చప్పుడు = శబ్దము; కాకుండన్ = అవ్వకుండగ; తప్పుటడుగులు = ఎత్తెత్తిఅడుగులు; ఇడుచున్ = వేస్తూ; ఇనపగొలుసుల = ఇనపసంకెళ్ళ; మెలుసులు = సంబంధములు, మెలికలు; వీడినన్ = విడిపోగా; తాలంబులున్ = బీగములు; మహా = మిక్కిలి; ఉత్తాలుండు = గొప్పవాడు; ఐన = అయిన; బిడ్డన్ = పిల్లవాని; కిన్ = కి; అడ్డంబు = అడ్డము; కాక = కాకుండగా; కీలు = కీళ్ళు; ఊడి = వదలివేసి; వీడిపడన్ = విడిపోవుటతో; అరళంబులు = తలుపులు; విరళంబులు = ఎడము కలవి, తెఱచుకున్నవి; అయినన్ = కాగా; సరళంబులు = ప్రతి బంధకములు లేనివి; అగు = ఐన; మొగసాలన్ = సింహద్వారములను; గడచి = దాటి; పాపఱేడు = ఆదిశేషుడు {పాపఱేడు - పాప (సర్పము)లకు ఱేడు (రాజు), ఆదిశేషుడు}; వాకిళ్ళున్ = ద్వారములను; మరల = మళ్ళా; మూయుచున్ = మూసివేయుచు; పడగలు = పడగలను; ఎడగలుగన్ = విశాల మగునట్లు; విప్పి = విడదీసి; కప్పి = గొడుగువలె కప్పి; ఏచి = అతిశయించి; కాచికొని = కనిపెట్టుకొని ఉండి; వెంటనంటి = వెనుకనే; రాగా = వస్తుండగా; తూగి =తూలుతూ, వెడలి; నడచున్ = వెళ్ళుతున్న, పోవుచున్న; ఎడన్ = సమయము నందు.

భావము:- వసుదేవుడు పురిటింటిని దాటి, తప్పటడగులు వేస్తూ చడి చప్పుడు కాకుండా వస్తున్నాడు. విష్ణుమాయ వలన కాళ్ళకి చేతులకి ఉన్న ఇనపగొలుసులు, సంకెళ్ళు అతుకులు వీడి ఊడిపోయాయి. ఆ మహామహిమాన్వితుని సంకల్పానికి అడ్డు రాలేక తలుపుల తాళాలు కీళ్ళు ఊడి పడిపోయాయి. ద్వారాలు వాటంతట అవే తెరుచుకొన్నాయి. వసుదేవుడు మెల్ల మెల్లగా ముందున్న చావళ్ళు అన్ని దాటాడు. అక్కడెక్కడా దాక్కుందా మన్నా ఏమి లేని తిన్నని పొడుగైన చావళ్ళు. అయినా శ్రీహరి మాయ వలన ఎవరు చూడలేదు. వసుదేవుడు ఇలా చావళ్ళు దాటుతుంటే ఆదిశేషుడు ఆ ద్వారాలని మూస్తూ వెనువెంట వస్తున్నాడు. పడగలు విప్పి ఆ బాలునికి గొడుగులా పట్టి వెనుకనించి ఎలాంటి ఆపద రాకుండా కాస్తూ అనుసరిస్తున్నాడు. వసుదేవుడు ముందుకు వెళుతూ ఉన్నాడు.

10.1-144-క.

ఆ శౌరికిఁ దెరువొసఁగెఁ బ్ర

కాశోద్ధత తుంగ భంగ కలిత ధరాశా

కాశ యగు యమున మును సీ

తేశునకుఁ బయోధి త్రోవ యిచ్చిన భంగిన్.

టీక:- ఆ = ఆ; శౌరి = వసుదేవుని {శౌరి - శూరిని పుత్రుడు, వసుదేవుడు}; కిన్ = కి; తెరువు = దారి; ఒసంగెన్ = ఇచ్చెను; ప్రకాశ = బాగుగా కనబడుతు; ఉద్ధతన్ = అతిశయించిన; తుంగ = పొడవైన; భంగ = అలలు; కలిత = కలిగిన; ధర = భూమి; ఆశ = దిక్కులు; ఆకాశ = ఆకాశము కలది; అగు = ఐన; యమున = యమునానది; మును = ఇంతకు పూర్వము; సీతేశున్ = శ్రీరాముని {సీతేశుడు - సీతాదేవి యొక్క భర్త, రాముడు}; కున్ = కు; పయోధి = సముద్రము {పయోధి - పయస్ (నీటి)కి నిధి, కడలి}; త్రోవ = దారి; ఇచ్చిన = ఇచ్చిన; భంగిన్ = విధముగా.

భావము:- శూరుని పుత్రుడైన వసుదేవుడు నవజాత శిశువుని రేపల్లెకు తరలిస్తు యమున దగ్గరకు వచ్చాడు. ఎగిసిపడుతున్న పెద్దపెద్ద అలలతో భూమినుండి ఆకాశందాకా నల్దిక్కులను కమ్ముకుంటు ప్రవహిస్తూ ఉన్న, ఆ నది పూర్వకాలంలో శ్రీరామునికి లంకాపురం వెళ్ళటానికి సముద్రుడు త్రోవ యిచ్చినట్లే, ఆ శిశు రూపి శ్రీకృష్ణ భగవానునికి యమున దారి యిచ్చింది.

## శయ్యన నుంచుట

10.1-145-వ.

ఇట్లు యమున దాఁటి, దూఁటి, చని నందుని మందం జేరి, యం దమంద నిద్రం బొంది, యొడలెఱుంగని గొల్లలం దెలుపనొల్లక , నిత్యప్రసాద యగు యశోదశయ్య నొయ్యన చిన్నినల్లనయ్య నునిచి, చయ్యన నయ్యవ్వ కూఁతు నెత్తుకొని మరల నింటికిఁ బంటింపక వచ్చి య చ్చిఱుతపాపను దేవకి ప్రక్కం జక్క నిడి.

టీక:- ఇట్లు = ఈ విధముగ; యమున = యమునానది; దాటి = దాటివేసి; దూటి =చొచ్చి; చని = వెళ్ళి; నందుని = నందుని యొక్క; మందన్ = పల్లెను; చేరి = ప్రవేశించి; అందు = అక్కడ; అమంద = గాఢమైన,

మందంకాని; నిద్రన్ = నిద్రను; పొంది = పోయి; ఒడలు = ఒళ్ళు; ఎఱుంగని = తెలియని; గొల్లలన్ = యాదవులకు; తెలుపన్ = తెలియజేయుటకు; ఒల్లకన్ = అంగీకరించకుడా; నిత్య = ఎల్లప్పుడును; ప్రసాద = ప్రసన్నంగా ఉండెడి ఆమె; అగు = ఐన; యశోదన్ = యశోద యొక్క; శయ్యన్ = పక్కమీద; ఒయ్యన్ = త్వరితముగా; చిన్ని = చిన్నపిల్లవాడైన; నల్లనయ్యను = శ్రీకృష్ణుని {నల్లనయ్య - నల్లని అయ్య, కృష్ణుడు}; చయ్యనన్ = చటుక్కున; ఆ = ఆ; అవ్వ = అమ్మ యొక్క; కూతున్ = పుత్రికను; ఎత్తుకొని = చేతులలోకి తీసుకొని; మరలన్ = వెనుకకి; ఇంటి = తన నివాసమున; కిన్ = కి; పంటింపకన్ = సంకోచింపకుండగ; వచ్చి = వచ్చి; ఆ = ఆ; చిఱుత = చిన్ని; పాపను = బిడ్డను; దేవకి = దేవకీదేవి; ప్రక్కన్ = ప్రక్కన; చక్కన్ = చక్కగా; ఇడి = పెట్టి.

భావము:- ఇలా వసుదేవుడు యమునానదిని దాటి వెళ్ళి, హుటాహుటిని నందుని వ్రేపల్లెను ప్రవేశించాడు. అక్కడ మందలోని గొల్లలందరు ఒళ్ళుతెలియని అతిగాఢమైన నిద్రలో ఉన్నారు. వారికి చెప్పడం ఇష్టంలేని వసుదేవుడు తిన్నగా ఎప్పుడు ప్రసన్నంగా ఉండే యశోదాదేవి శయ్య దగ్గరకు వెళ్ళాడు. ఆమె కూడ మైమరచి నిద్రపోతోంది. తన చేతిలోని చిన్నారి నల్లనయ్యను జాగ్రత్తగా పరుండబెట్టి. ఆమె పక్కలోని ఆడపిల్లని ఎత్తుకొని వెనక్కి బయలుదేరాడు. తాత్సారం చేయకుండా వేగంగా తిరిగి వచ్చి దేవకీదేవి పక్కలో చక్కగా పడుకోబెట్టాడు.

10.1-146-క.

పదముల సంకెల లిడుకొని

మదిఁ దలఁకుచు శూరసుతుడు మందుఁడు బోలెన్

బెదరుగల రీతి దేహము

గదలించుచు నొదిఁగియుండె గఱువతనమునన్

టీక:- పదములన్ = కాళ్లకు; సంకెలల్ = సంకెళ్ళు; ఇడికొని = పెట్టుకొని; మదిన్ = మనసునందు; తలకుచు = బెదురుతు; శూరసుతుడు = వసుదేవుడు {శూరసుతుడు - శూరుని యొక్క పుత్రుడు, వసుదేవుడు}; మందుడు = ఏమి ఎరుగనివాని; పోలెన్ = వలె; బెదురు = బెరుకు; కల = ఉన్నట్టి; రీతిన్ = విధముగా; దేహమున్ = శరీరమును; కదిలించుచున్ = వణికించుచు; ఒదిగి = ముడుచుకొని; ఉండెన్ = ఉండెను; గఱువతనమునన్ = గడుసుతనముతో.

భావము:- శూరసేనుని కొడుకైన వసుదేవుడు మనసులో తడబడుతు కాళ్ళకి సంకెళ్ళు తగిలించుకొన్నాడు. అతడు "ఏమి తెలియని వాడిలా, బెదిరిపోతున్న వాడిలా, ఒదిగి ఒదిగి పోతూ, శరీరం వణుకుతున్న వాడిలా" గడుసుగా నటిస్తూ ఉన్నాడు.

10.1-147-క.

వనజాక్షునిఁ దెచ్చుటయును

దనసుతఁ గొనిపోవుటయును దా నెఱుఁగక మూఁ

గిననిద్ర జొక్కియుండెను

వనజాక్షి యశోద రేయి వసుధాధీశా!

టీక:- వనజాక్షునిన్ = శ్రీకృష్ణుని {వనజాక్షుడు - వనజము (పద్మము)ల వంటి అక్షుడు (కన్నులు కలవాడు), విష్ణువు}; తెచ్చుటయును = తీసుకొని వచ్చుట; తన = తన యొక్క; సుతన్ = పుత్రికను; కొనిపోవుటయును = తీసుకొని పోవుట; తాన్ = ఆమె; ఎఱుగకన్ = తెలియక; మూగిన్ = ముంచుకొచ్చిన; నిద్రన్ = నిద్ర యందు; చొక్కి = మైమరచిపోయి; ఉండెను = ఉండెను; వనజాక్షి = అందగత్తె {వనజాక్షి - పద్మాక్షి, సుందరి}; యశోద = యశోదాదేవి; రేయి = ఆ రాత్రి; వసుధాధీశ = రాజా {వసుధాధీశుడు - భూమికి ప్రభువు, రాజు}.

భావము:- మహారాజా! పరీక్షిత్తూ! ఆ పద్మాల లాంటి కళ్ళున్న నల్లనయ్యను తీసుకురావడంకాని, తన కూతురును తీసుకుపోవడంకాని ఏమాత్రం ఎరుకలేకుండా యశోదాదేవి మైమరచి కమ్ముకు వచ్చిన నిద్రమైకంలో ఆ రాత్రంతా ఉండిపోయింది. (పద్మాల్లాంటి కళ్ళున్న ఆ యశోదాదేవికి అలాంటి కళ్ళున్న కొడుకు)

10.1-148-సీ.

అంత బాలిక యావు రని యేడ్చు చిఱుచప్పు-

డాలించి వేకన నాఁకయింటి

కావలివారు మేల్కని చూచి తలుపుల-

తాళముల్ తొంటివిధమున నుండఁ

దెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్ళాడె-

రమ్ము రమ్మని భోజరాజుతోడఁ

జెప్పిన నాతఁడు చిడిముడి పాటుతోఁ-

దల్పంబుపై లేచి తత్తఱమున

10.1-148.1-తే.

వెండ్రుకలు వీడఁ బైచీర వ్రేలియాడ
దాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ
భూరివైరంబుతోఁ గూడఁ బురిటియింటి
జాడఁ జనుదెంచి యా పాపఁ జంపఁ గదియ.

టీక:- అంతన్ = అప్పుడు; బాలిక = ఆ ఆడపిల్ల; ఆవురు = ఆ...; అని = అనుచు; ఏడ్చు = రోదించెడి; చిఱు = చిన్న; చప్పుడున్ = శబ్దమును; వేకనన్ = వేకువజామున; నాకయింటి = చెఱసాల; కావలివారలు = కాపలావాళ్ళు; మేల్కని = నిద్రలేచి; చూచి = పరిశీలనగా చూసి; తలుపుల = ద్వారముల యొక్క; తాళముల్ = బీగములు; తొంటి = ఇంతకు ముందు; విధమునన్ = విధముగానే; ఉండన్ = ఉన్నట్లుగా; తెలిసి = చూసుకొని; చక్కనన్ = చక్కగా; వచ్చి = వచ్చి; దేవకి = దేవకీదేవి; నీళ్ళాడెన్ = ప్రసవించెను; రమ్ము = రా; రమ్ము = రా; అని = అని; భోజరాజు = కంసుని {భోజరాజు - భోజదేశమునకు రాజు, కంసుడు}; తోడన్ = తోటి; చెప్పినన్ = తెలుపగా; ఆతడున్ = అతను; చిడిముడిపాటు = తొట్రుపాటు; తోన్ = తోటి; తల్పంబున్ = మంచము; పైన్ = మీంచి; లేచి = లేచి; తత్తఱమునన్ = తొందరలో.

వెండ్రుకల్ = తలవెంట్రుకలు; వీడన్ = వీడిపోగా; పైన్ = వంటిమీది; చీర = బట్ట; వ్రేలి = వేళ్ళాడుతుండగ; తాల్మి = ధైర్యము; కీలూడన్ = చెదిరిపోగా; రోష = కోపము అనెడి; అగ్నిన్ = అగ్నితోటి; భూరి = అత్యధికమైన; వైరంబున్ = శత్రుత్వము; తోగూడన్ = కలిగియుండి; పురిటియింటి = ప్రసవగృహము; జాడన్ = దారిని; చనుదెంచి = వచ్చి; ఆ = ఆ; పాపన్ = ఆ బిడ్డను; చంపన్ = వధించుటకు; కదియన్ = దగ్గరకురాగానే.

భావము:- అక్కడ మథురలో, అప్పుడు, కారాగారంలో పసిపిల్ల కేరుకేరుమని ఏడ్చింది. ఆ శబ్దం విన్న కావలివారి విష్ణుమాయ వీడిపోడంతో వెంటనే మేల్కొన్నారు. లోపలికి తొంగి చూసారు. తాళాలు అవి మామూలుగా ఉన్నాయని స్థిమితపడ్డారు. వెంటనే కంసుడి దగ్గరకు పరుగెట్టుకొని వెళ్ళి, "దేవకి ప్రసవించింది. తొందరగా ర"మ్మని పిలిచారు. అతడు గాబరాగా మంచం దిగాడు. వెంట్రుకలు చిందర వందరగా వేళ్ళాడుతున్నాయి. పై పంచె నేలమీద జీరాడుతోంది. ఓర్పు నశించి రోషాగ్ని విజృంభిస్తోంది. తీరని శత్రుత్వంతో, వాడు పురుటింటికి పరుగుపెట్టాడు. పసిపాపని చంపేద్దామని దగ్గర కెళ్లాడు.

## దేవకి బిడ్డను విడువ వేడుట

10.1-149-వ.

అంత దేవకీదేవి యడ్డంబు వచ్చి యిట్లనియె.

టీక:- అంతన్ = అప్పుడు; దేవకీ = దేవకి అనెడి; దేవి = ఉత్తమురాలు; అడ్డంబు = అడ్డుకొన; వచ్చి = వచ్చి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అప్పుడు, చెల్లి దేవకి అన్న కంసుడికి అడ్డం వచ్చి ఇలా అంది.

10.1-150-ఉ.

"అన్న! శమింపుమన్న! తగ దల్లుఁడు గాఁ డిది మేనగోడ లౌ
మన్నన జేయు మన్న! విను మానినిఁ జంపుట రాచపాడి గా
దన్న! సుకీర్తివై మనఁగ దన్న! మహాత్ములు పోవు త్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న! నినున్ శరణంబు వేడెదన్.

టీక:- అన్న = పెద్ద సోదరుడా; శమింపుము = శాంతించుము; అన్న = తండ్రి; తగదు = ఇది మంచిదికాదు; అల్లుడు = నీకు అల్లు డయ్యే బాలుడు; కాడు = కాడు; ఇది = ఈమె; మేనకోడలు = మేనకోడలు (ఆడపిల్ల); ఔ = అగును; మన్నన జేయుము = మన్నింపుము; అన్న = తండ్రి; విను = వినుము; మానినిన్ = స్త్రీని; చంపుట = వధించుట; రాచ = క్షత్రియులకు; పాడి = తగినది; కాదు = కాదు; అన్న = తండ్రి; సు = మంచి; కీర్తివి = కీర్తికలవాడు; ఐ = అయ్యి; మనన్ కద = బ్రతుకుము; అన్న = తండ్రి; మహాత్ములు = గొప్పవారు; పోవు = నడచెడి; త్రోవన్ = దారిలో; పోవు = వెళ్ళుము; అన్న = తండ్రి; భవత్ = నీ యొక్క; సహోదరిన్ = తోడబుట్టినదానిని; కద = కదా; అన్న = తండ్రి; నినున్ = నిన్ను; శరణంబున్ = రక్షణముకై; వేడెదన్ = ప్రార్థించెదను.

భావము:- "ఓ అన్నా కంసా! శాంతించవయ్యా! ఇది నిన్ను సంహరించే మేనల్లుడు అయ్యే మగపిల్లవాడు కాదు. ఈమె ఆడపిల్ల నీకు మేనకోడ లవుతుంది. ముద్దు జేయుమయ్యా! ఆడవారిని చంపుట క్షత్రియమర్యాదలకు తగిన పని కాదు కదయ్యా! కోపాన్ని చల్లార్చుకొని మహాత్ములు నడచే

దారిలో నడువవయ్యా! మంచి కీర్తిమంతుడవుగా జీవించవయ్యా! నేను నీ సోదరి నయ్యు! నిన్ను శరణు వేడుతున్నానయ్యా! ఈ పిల్లను వదిలెయ్యవయ్యా!

10.1-151-క.

కట్టా; యార్గురు కొడుకులఁ
బట్టి వధించితివి; యాఁడుఁబడుచిది; కోడల్;
నెట్టన చంపఁగ వలెనే?
కట్టిఁడివి గదన్న! యన్న! కరుణింపఁ గదే.

టీక:- కట్టా = అయ్యో; ఆర్గురు = ఆరుగురు (6); కొడుకులన్ = నా పుత్రులను; పట్టి = పట్టుకొని; వధించితివి = చంపివేసితివి; ఆడుపడుచు = ఆడపిల్ల; ఇది = ఈమె; కోడల్ = మేనకోడలు (ఆడపిల్ల); నెట్టనన్ = అనివార్యముగా; చంపగవలెనే = వధించవలెనా; కట్టిడివి = కఠినాత్ముడవు; కద = కదా; అన్న = అయ్య; అన్న = సోదరుడా; కరుణింపగదే = దయచూపుము.

భావము:- అయ్యో! ఇప్పటికే పసిబిడ్డలైన ఆరుగురు కొడుకుల్ని చంపేశావు కదయ్యా! ఇదేమో ఆడపిల్ల కదా, నీ మేనకోడలు కదా ఎందుకని చంపాలయ్యా? అన్నా! మరీ దయలేని వాడవైపోయావయ్యా! కరుణ చూపి వదిలిపెట్టవయ్యా!

10.1-152-క.

పుత్రుడు నీ బ్రతుకునకును
శత్రుండని వింటిగాన సమయింపఁ దగున్;
పుత్రులకు నోచ నైతిని
పుత్రీదానంబు జేసి పుణ్యముఁ గనవే."

టీక:- పుత్రుడు = కొడుకు; నీ = నీ యొక్క; బ్రతుకున్ = జీవితమున; కును = కు; శత్రుండు = విరోధి; అని = అని; వింటిన్ = విన్నావు; కాన = కనుక; సమయింపన్ = వధించుటకు; తగున్ = యుక్తము అగును; పుత్రుల్ = కొడుకుల; కున్ = కు; నోచనైతిని = నోచుకొనలేదు పోనీ; పుత్రీ = కూతురును; దానంబున్ = దానము; చేసి = చేసి; పుణ్యమున్ = పుణ్యమును; కనవే = మూటగట్టుకొనుము.

భావము:- నా కొడుకు నీ ప్రాణానికి శత్రువు అని విన్నావు. అందుకు చంపేవు. సరే! నేను కొడుకుల్ని ఎలాగూ నోచుకోలేదు. కనీసం ఈ కూతుర్నైనా నాకు వదలిపెట్టి పుణ్యంకట్టుకోరాదా?"

## మాయ మింటనుండి పలుకుట

10.1-153-వ.

అని పయ్యెదఁ జక్కఁ సవరించుకొనుచుఁ, బలవరించుచు, భ్రాంతిపడి కూఁతున్ గ్రక్కున నక్కునం జక్క హత్తుకొని, చెక్కుచెక్కున మోపి, చయ్యన నుత్తరీయాంచలంబున సంచలతం గప్పి, చప్పుడుగాఁ గుయ్యిడ, నయ్యెడం గ్రయ్యం బడి వాఁడు పోఁడిమి చెడఁ, దోఁబుట్టువుం దిట్టి, చిట్టిపట్టి నావురని వాపోవఁ, గావరంబున నడుగు లొడిసి తిగిచి, వడిం బెడిసిపడం బుడమిపైం బడవైచిన, న బ్బాలయు నేలంబడక, లీల నెగసి, నవ్య దివ్య మాలికా గంధ బంధుర మణి హారాంబరా ద్యలంకార మనోహారిణియు, గదా శంఖ చక్ర పద్మశర చాపాసి శూలధారిణియునై, యెనిమిది కరంబులం గరంబొప్పుచు, సిద్ధ చారణ కిన్నర గరుడ గంధర్వాది వైమానిక నికాయంబు గానికలిచ్చి పొగడ, నెగడుచు, నచ్చరల యాట పాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి, కంటుపడఁ, గంసుని కిట్లనియె.

టీక:- అని = అని; పయ్యెదన్ = కొంగును; చక్కగన్ = చక్కగా; సవరించుకొనుచున్ = సరిచేసుకొనుచు; పలవరించుచున్ = మొత్తుకొనుచుండగా; భ్రాంతిపడి = కలవరపడిపోయి; కూతున్ = పుత్రికను; గ్రక్కునన్ = తటాలున; అక్కునన్ = రొమ్మునందు; చక్కన్ = చక్కగా; హత్తుకొని = చేర్చిపట్టుకొని; చెక్కు = చెంపకు; చెక్కున = చెంపని; మోపి = ఆన్చి; చక్కనన్ = ఒప్పుగా; ఉత్తరీయాంచలంబున = పైటచెఱగుతో; సంచలతన్ = కంగారును; కప్పి = కప్పిపుచ్చుకొని; చప్పుడుగాన్ = గట్టిగా; కుయ్యిడన్ = రోదించగా; ఆ = ఆ; ఎడన్ = సమయమునందు; క్రయ్యంబడి = కలియబడి; వాడు = అతను; పోడిమి = పద్ధతి; చెడన్ = తప్పి; తోబుట్టువున్ = చెల్లెలిని; తిట్టి = దూషించి; చిట్టి = చిన్ని; పట్టిన్ = పాపను; ఆవురు = ఆ...; అని = అని; వాపోవగన్ = ఏడ్చుచుండగా; కావరంబునన్ = గర్వముతో; అడుగులు = కాళ్ళు; ఒడిసి = ఒడిసిపట్టికొని; తిగిచి = లాగిపెట్టి; వడిన్ = వేగముగా; బెడిసిపడన్ = మిడిసిపాటుతో; పుడమి = నేల; పైన్ = మీదకి; పడవైచినన్ = విసిరికొట్టగా; ఆ = ఆ; బాలయున్ = ఆడపిల్ల; నేలన్ = నేలమీద; పడకన్ = పడిపోకుండ; లీలన్ = అద్భుతముగా; ఎగసి = ఎగిరి; నవ్య = సరికొత్త; దివ్య = దివ్యమైన; మాలికా = పూలమాలలతో; గంధ = సువాసన; బంధుర = తరుచైన; మణి = రత్నాల; హార = దండలు;

ఆది = మున్నగు; అలంకార = భూషణములతో; మనోహారిణియున్ = అందమైనది; గదా = గద; శంఖ = శంఖము; చక్ర = చక్రము; పద్మ = పద్మము; శర = బాణములు; చాప = విల్లు; అసి = ఖడ్గము; శూల = శూలము; ధారిణియున్ = ధరించినామె; ఐ = అయ్యి; ఎనిమిది = ఎనిమిది (8); కరంబులన్ = చేతులతో; కరంబున్ = మిక్కిలి; ఒప్పుచున్ = ప్రకాశించుచు; సిద్ధ = సిద్ధులు; చారణ = చారణులు; కిన్నర = కిన్నరులు; గరుడ = గరుడులు; గంధర్వ = గంధర్వులు; ఆది = మున్నగు; వైమానిక = దేవయోనివిశేషముల {వైమానికులు - విమానము లందు సంచరించువారు, దేవయోని విశేషములు}; నికాయంబు = సమూహములు; కానికలు = బహుమతులు; ఇచ్చి = సమర్పించి; పొగడన్ = స్తోత్రములు చేయుచుండ; నెగడుచున్ = ప్రకాశించుచు; అచ్చరల = అప్సరసల యొక్క; ఆట = నాట్యములు; పాటల = గానముల; కున్ = కు; మెచ్చుచున్ = మెచ్చుకొనుచు; మింటన్ = ఆకాశము; నుండి = నుండి; కంటబడి = కనిపించి; కంటుపడన్ = విరోధించి; కంసున్ = కంసుని; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను;

భావము:- ఆడపిల్ల కదా రక్షించుకోవచ్చు అని దేవకీదేవి భ్రాంతి పడి, విలపిస్తూ, పలవరిస్తూ పిల్లని ఎత్తుకొని గుండెలకు హత్తుకొని, జారిపోతున్న పైట సర్దుకొంటు, పాప చెక్కిలికి తన చెక్కిలి చేర్చి, పైటకొంగుతో చటుక్కున పిల్లని కప్పింది. పసిపిల్లేమో గట్టిగా ఏడిచింది. వాడప్పుడు రెచ్చిపోయి సిగ్గు, లజ్జ వదిలేసి చెల్లెల్ని తిట్టాడు. కన్నుమిన్ను కానని కావరంతో చిన్నారిపాప కాళ్ళు పట్టుకొని లాగాడు. పాప కెవ్వుమని ఏడ్చింది. అయినా లెక్కచేయక నేల మీదకి విసిరి కొట్టాడు. కాని పాప నేలమీద పడలేదు. రివ్వున ఆకాశానికి ఎగిరింది. ఆమె దేవతాపుష్పాల సువాసనలతో ఘుమఘుమలాడిపోతోంది. మణిమయ హారాలు మొదలైన ఆభరణాలతో మనోహరంగా ఉంది. గద, శంఖం, చక్రం, పద్మం, బాణం, ధనుస్సు, ఖడ్గం, శూలం అనే ఎనిమిది ఆయుధాలు ఎనిమిది చేతులలో చక్కగా ధరించి ఉంది. విమానాల్లో ఆకాశ మార్గంలో పయనించే సిద్ధులు, చారణులు, కిన్నరలు, గంధర్వులు, గరుడులు మొదలైన దేవ గణాలు ఆమెకు కానుకలు సమర్పించి స్తోత్రాలు చేస్తున్నారు. అప్సరసలు నాట్యాలు చేస్తున్నారు. ఆ మాయాదేవి వారిని మెచ్చుకుంటూ, ఆకాశంలో కనబడి, కంసుడిని కర్కశంగా ఇలా హెచ్చరించింది.

10.1-154-ఉ.

"తెంపరివై, పొరిం బొరిని, దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం
జంపితి, వంతనైన నుపశాంతి వహింపక, ఱాలమీఁద నో
ప్పింపితి, విస్సిరో! యిదియు బీరమె? నా సరసన్ జనించి నిన్
జంపెడు వీరుఁ డొక్క దెస సత్కృతి నొందెడువాడు; దుర్మతీ!"

టీక:– తెంపరివి = తెంపరితనం కలవాడవు; ఐ = అయ్యి; పొరింబొరిని = వరుసగా; దేవకి = దేవకి యొక్క; బిడ్డలన్ = పుత్రులను; చిన్ని = చంటి; కుఱ్ఱలన్ = పిల్లవాళ్ళను; చంపితివి = వధించావు; అంతన్ = అంతటితో; ఐననున్ = అయిన; ఉపశాంతి = ఓర్పు; వహింపక = పట్టకుండ; ఱాల = రాళ్ళ; మీదన్ = పైన; నొప్పింపితి = కొట్టితివి; ఇస్సిరో = ఛీ; ఇదియున్ = ఇదికూడ; బీరమె = మగతనమేనా, కాదు; నా = నాకు; సరసన్ = తోడనే; జనించి = పుట్టి; నిన్ = నిన్ను; చంపెడు = వధించెడి; వీరుడు = శూరుడు; ఒక్క = ఒకానొక; దెసన్ = పక్కన; సత్కృతిన్ = సమ్మానములను, మంచిగ చూడబడుట; ఒందెడున్ = పొందుచున్నాడు; వాడు = అతను; దుర్మతీ = చెడ్డబుద్ధి గలవాడా.

భావము:– "దుర్మార్గుడా! తెంపరితనంతో దేవకీదేవి బిడ్డలను వరసపెట్టి ఆరుగురిని వధించావు. అంతటితో శాంతించక పసిబిడ్డను ఆడపిల్లను నన్ను విసిరి కొట్టావు; ఛీ!ఛీ! ఇదేనా నీ వీరత్వం? నిన్ను చంపే మహా వీరుడు ఒకడు నాతో పాటే పుట్టి మరో చోట గొప్ప గౌరవాలు పొందుతున్నాడులే."

10.1-155-వ.

అని పలికి.

టీక:– అని = అని; పలికి = చెప్పి.

భావము:– ఇలా హెచ్చరించి అదృశ్యమైంది.

10.1-156-క.

మహనీయ గుణాస్పదయై,

మహిలో నా దేవి జనము మన్నింపంగా,

బహు నామ నివాసంబుల,

బహునామములం జరించె భద్రాత్మికయై.

టీక:– మహనీయ = మిక్కిలి గొప్పదైన; గుణ = సుగుణములకు; ఆస్పద = ఉనికిపట్టు; ఐ = అయ్యి; మహి = భూలోకము; లోన్ = అందు; ఆ = ఆ; దేవి = దేవత; జనము = ప్రజలు; మన్నింపంగా = పూజించుచుండగా; బహు = అనేకమైన; నామ = పేర్లు కల; నివాసంబులన్ = స్థలము లందు; బహు = అనేకమైన; నామములన్ = పేర్లతో; చరించెన్ = వర్తిల్లెను; భద్రాత్మిక = శుభముల నిచ్చునది; ఐ = అయ్యి.

భావము:- ఆ దేవి భూలోకంలో అనేక చోట్ల ప్రజలచే పూజింపబడుతున్నది. ఒక్కొక్కచోట ఒక్కొక్క పేరుతో ఒక్కో మహాగుణం ప్రధానంగా వివిధ నామాలతో విలసిల్లుతూ ఉన్నది. ఏ ఊరైనా, ఏ పేరైనా రక్షించడమే ఆమె ముఖ్య లక్షణమై ఉంటుంది.

10.1-157-వ.

అంత నాబోటి పలికిన కలికి పలుకులు ములుకులై, చెవులఁ జిలికిన, నులికిపడి, జళుకు గదిరిన మనంబున, ఘనంబుగ వెఱఁగంది, కంది, కుందెడు దేవకీ వసుదేవుల రావించి, యాదరంబున సంభావించి, చేరి, వారితో నిట్లనియె.

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; బోటి = ఆమె; పలికిన = చెప్పిన; కలికి = చతురమైన; పలుకులు = మాటలు; ములుకులు = బాణములు; ఐ = అయ్యి; చెవులన్ = చెవుల యందు; చిలికినన్ = సోకగా; ఉలికిపడి = అదిరిపోయి; జళుకు = దిగులు; కదిరిన = పుట్టిన; మనంబునన్ = మనసుతో; ఘనంబుగా = మిక్కిలి అధికముగా; వెఱగంది = బెదిరిపోయి; కంది = సంతాపించి; కుందెడు = దుఃఖించెడి; దేవకీ = దేవకి; వసుదేవులన్ = వసుదేవులను; రావించి = పిలిపించి; ఆదరంబునన్ = ఆత్మీయతతో; సంభావించి = మన్నించి; చేరి = దగ్గరకుపోయి; వారి = వారల; తోన్ = తోటి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అప్పుడు ఆ యోగమాయ పలుకులు బాణాలై చెవులో దూరి కలతపెట్టాయి. అతడు ఉలిక్కిపడ్డాడు. చెదరిన మనస్సుతో బాగా భయపడ్డాడు. దుఃఖంతో కుంగిపోతున్న దేవకీవసుదేవులను పిలిపించి, ఆదరించి, గౌరవించాడు. దగ్గరకు చేరి వారితో ఇలా అన్నాడు.

10.1-158-ఉ.

"పాపుఁడ; బాలఘాతకుఁడ; బంధు విరక్తుఁడ; దుష్ట చిత్తుఁడన్;
గోపనుఁడన్; జరన్మృతుఁడఁ; గ్రూరుఁడ; బ్రాహ్మణహంత భంగి మీ
పాపల జంపితిన్; బయలి పల్కుల నమ్మితి; సాధులార! నా
పాపము లుగ్గడింపక, కృపాపరులై కనరే! శమింపరే!

టీక:- పాపుడన్ = పాపము చేసిన వాడను; బాల = శిశువులను; ఘాతకుడన్ = చంపిన వాడను; బంధు = చుట్టములపై; విరక్తుడన్ = ప్రేమ లేనివాడను; దుష్టచిత్తుడన్ = చెడ్డబుద్ధి గలవాడను; కోపనుడన్ = అధిక

కోపము కలవాడను; చరత్ = తిరుగుతున్న; మృతుడన్ = శవముతో సమానుడను; క్రూరుడన్ = కఠినుడును; బ్రాహ్మణహంత = బ్రహ్మహత్య చేసెడివాని; భంగిన్ = వలె; మీ = మీ యొక్క; పాపలన్ = పిల్లలను; చంపితిన్ = వధించితిని; బయలి = ఆకాశవాణి; పల్కులన్ = మాటలను; నమ్మితిన్ = విశ్వసించితిని; సాధులారా = సజ్జనులులారా; నా = నా యొక్క; పాపములున్ = పాపపు పనులను; ఉగ్గడింపక =ప్రకటించక; కృపాపరులు = దయ గలవారు; ఐ = అయ్యి; కనరే = చూడండి; శమింపరే = శాంతించండి.

భావము:- "శాంతమూర్తులారా! మహాపాతకుడను. నేను బయలు మాటలు నిజమని నమ్మి బ్రహ్మహత్య చేసే పాతకుడులా మీ పురిటి కందులను చంపాను. బంధువులపై కత్తిగట్టిన దుష్ట బుద్ధిని. క్రోధం నా కళ్ళుకప్పివేసింది. నేను బ్రతికున్న చచ్చిన వాడితో సమానం. మహాక్రూరుడిని. మహాపాపిని. నా తప్పులు, పాపాలు లెక్కించకుండ దయాస్వభావంతో నన్ను కరుణించి క్షమించండి.

10.1-159-ఉ.

ఒక్కెడఁ బ్రాణులందఱు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పగా,
నొక్కొక మేనితో బొడమి, యొక్కొక త్రోవను రాకపోకలం
జిక్కులఁ బొందుచుండుదురు; చెల్మిని సంసృతితోడఁ బాయ, రే
నెక్కడి హంత? మీ శిశువు లెక్కడి హన్యులు? దూఱనేటికిన్?

టీక:- ఒక్క = ఒకానొక; ఎడన్ = చోట; నిజ = తమకు; ఉచిత = తగిన; కర్మముల్ = పనులను; ఓలిన్ = క్రమముగా; త్రిప్పగా = నడిపించుతుండగా; ఒక్కొక్క = ఒకటి తరువాత ఒకటి; మేని = దేహముల; తోన్ = తోటి; పొడమి = పుట్టి; ఒక్కొక్క = వేరువేరు విధముల; త్రోవను = దారు లందు; రాకపోకలన్ = జననమరణము లందు; చిక్కులన్ = ఇక్కట్లను; పొందుచుండుదురు = అనుభవించెదరు; చెల్మిని = స్నేహభావముతో; సంసృతి = సంసార లంపటము; తోడన్ = నుండి; పాయలేరు = విడివడలేరు; ఏన్ = నేను; ఎక్కడి = ఎక్కడి; హంత = చంపినవాడను; మీ = మీ యొక్క; శిశువుల్ = పిల్లలు; ఎక్కడి = ఎక్కడి; హన్యులు = హత్య చేయబడినవారు; దూఱన్ = దూషించుట; ఏటికిన్ = ఎందుకు.

భావము:- వారి వారి కర్మలే జీవులను నడిపిస్తుంటాయి. అలా వారి కర్మలే కారణంగా, ఎన్నోరకాల జీవులు వారికి అనుకూలమైన దేహంతో ఒక్కోచోట జన్మిస్తారు. అందరు తలోవైపునుంచి వచ్చి ఒకచోట చేరతారు, జీవిస్తారు, ఎవరిదారిన వారు వెళ్ళిపోతారు. ఈ రాక పోకలలో చిక్కులు పడుతుంటారు. ఒకచోట ఏర్పడిన స్నేహాలు అక్కడ వదలి వెళ్ళిపోతారు. ఇలా ఉండగా, చంపేవాడు

ఎవడు? చనిపోయేవాడు ఎవడు? మీ బిడ్డలను చంపినవాడను నేను కాదు. వారు నాచే చంపబడ్డవారు అనటం కూడా సరి కాదు. ఇంక ఒకరి నేరాలొకరు ఎంచడం ఎందుకు?

10.1-160-క.

పగతురఁ జెఱిచితి ననియును,

బగతురచేఁ జెడితి ననియు, బాలుఁడు తలఁచున్;

బగ చెలుములు లే వాత్మకుఁ

బగచెలుముల కీలు కర్మబంధము సుండీ!"

టీక:- పగతురన్ = శత్రువులను; చెరచితిన్ = వధించితిని; అనియునున్ = అని; పగతుర = వైరుల; చేన్ = వలన; చెడితిని = పాడైపోతిని; అనియున్ = అని; బాలుడు = తెలివితక్కువవాడు; తలచున్ = భావించును; పగ = శత్రుత్వము; చెలుములు = స్నేహములు; లేవు = ఉండవు; ఆత్మ = ఆత్మ; కున్ = కి {బగచెలుములకీలు కర్మబంధము సుండీ.}; పగ = శత్రుత్వము; చెలుముల = మిత్రత్వముల; కీలు = మర్మము, సంబంధము; కర్మ = చేసికొన్న కర్మలకు; బంధము = సంబంధించినవి; సుండీ = సుమా.

భావము:- తాను శత్రువులను బాధించానని. తన్ను శత్రువులు బాధించారని అమాయకుడు మాత్రమే అనుకుంటాడు. సత్యం తెలుసుకొని ఆలోచిస్తే, ఆత్మకు స్నేహ విరోధాలు అంటూ లేవు. ఆ శత్రుత్వ మిత్రత్వాల మధ్య సంబంధం కేవలం తమ కర్మల బంధం మాత్రమే సుమా."

10.1-161-వ.

అని పలికి, కన్నీరు నించి, వగచి, వెఱచుచు, దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని, సంకెలలు విప్పించి, మిక్కిలి యక్కఱ గల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన, వారును బరితప్తుం డైన కంసునిఁ జూచి, రోషంబును బాసి; రంత నా వసుదేవుండు బావ కిట్లనియె.

టీక:- అని = అని; పలికి = చెప్పి; కన్నీరు = కన్నీటిని; నించి = కార్చి; వగచి = విచారించి; వెఱచుచున్ = బెదురుతూ; దేవకీ = దేవకి; వసుదేవుల = వసుదేవుల యొక్క; పాదంబులన్ = కాళ్ళు; పట్టుకొని = పట్టుకొని; సంకెలలన్ = సంకెళ్ళను; విప్పించి = ఊడదీయించి; మిక్కిలి = అధికమైన; అక్కఱ = ప్రీతి; కల = కలిగిన; వాక్యంబులన్ = మాటలతో; ఐక్యంబులు = దగ్గరి తనములు; నెఱపినన్ = నడపగా; వారును = వారు; పరి =

మిక్కిలి; తప్తుండు = పశ్చాత్తాపము పడువాడు; ఐన = అయినట్టి; కంసునిన్ = కంసుని; చూచి = కనుగొని, ఉద్దేశించి; రోషంబునున్ = కోపమును; పాసిరి = విడిచి పెట్టారు; అంతన్ = అంతట; ఆ = ఆ; వసుదేవుండు = వసుదేవుడు; బావ = భార్యకి అన్న; కిన్ = తోటి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను;

భావము:- కంసుడు ఇలా పలికి, దుఃఖించి, కన్నీరు పెట్టుకున్నాడు. బెదురు బెదురుగా దేవకీవసుదేవుల కాళ్ళు పట్టుకొని వేడుకున్నాడు. వారి సంకెళ్ళు ఊడదీయించాడు. చాలా ప్రేమ కురిసే మాటలతో ఐకమత్యాలు చూపించాడు. వారు కూడ పశ్చాత్తాపం పడుతున్న కంసుని చూసి శాంతించారు. అప్పుడు వసుదేవుడు కంసుడితో ఇలా అన్నాడు.

10.1-162-శా.

"బావా! నీ వచనంబు నిక్కము సుమీ; ప్రాణుల్ గతజ్ఞాను లై
నీవే నంచును లోభ మోహ మద భీ నిర్మిత్రతామోద శో
కావేశంబుల నొండొరుం బొడుతు రేకాకారుఁడై సర్వరూ
పావిష్టుండగు నీశ్వరుం దెలియలే రన్యోన్యవిభ్రాంతులై"

టీక:- బావా = బావా; నీ = నీ యొక్క; వచనంబు = మాట; నిక్కము = నిజమే; సుమీ = సుమా; ప్రాణుల్ = జీవులు; గత = పోయిన; జ్ఞానులు = విజ్ఞానము కలవారు; ఐ = అయ్యి; నీవు = నీవు; ఏను = నేను; అంచునున్ = అనుచు; లోభ = లోభము; మోహ = మోహము; మద = మదము; భీ = భీతి; నిర్మిత్రతామోద = స్నేహాంగీకార రాహిత్యము; శోక = దుఃఖము; ఆవేశంబులన్ = ఆవేశములతో; ఒండొరున్ = ఒకరినొకరు; పొడుతురు = చంపెదరు; ఏకాకారుడు = అఖండ స్వరూపుడు; ఐ = అయ్యి; సర్వ = సమస్తమైన; రూప = రూపముల జీవు లందు; ఆవిష్టుండు = ఉన్నవాడు; అగు = ఐన; ఈశ్వరున్ = భగవంతుని; తెలియ = తెలిసికొన; లేరు = లేరు; అన్యోన్య = ఒకిరిపై నొకరు; విభ్రాంతలు = నమ్మలేనివారు; ఐ = అయ్యి.

భావము:- "బావా! కంసమహారాజా! నీవు చెప్పిన మాట నిజమే సుమా! ప్రాణు లందరు అహంకారంచేత జ్ఞానాన్ని నష్టపోతారు. లోభం, మోహం, మదం, భయం, శత్రుత్వం, ఇష్టం, దుఃఖం, ఆవేశం మొదలైనవాటికి లోనై నువ్వా, నేనా అంటు ఒకరినొకరు వధించుకుంటూ ఉంటారు. అంతేగాని, ఉన్నది పరమాత్మ ఒకడే అనీ, అతనే అనేక రూపాలలో ఉంటాడని తెలుసుకోలేక, ఇతరులు వేరు తాము వేరు అనుకుంటూ భ్రాంతిలో పడుతూ ఉంటారు."

## కంసునికి మంత్రుల సలహా

10.1-163-వ.

అని యిట్లు బ్రసన్నులైన దేవకీవసుదేవుల యనుజ్ఞ వడసి, కంసుం డింటికిం జని, యా రేయి గడపి, మఱునాఁడు ప్రొద్దునం గ్రద్దనం దనకుం బరతంత్రులగు మంత్రుల రావించి, యోగనిద్ర వలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన, నపుడు వార లతని కిట్లనిరి.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; ప్రసన్నులు = అనుకూలురు; ఐన = అయినట్టి; దేవకీ = దేవకీదేవి; వసుదేవుల = వసుదేవుల; అనుజ్ఞ = సెలవు; పడసి = తీసుకొని; కంసుండు = కంసుడు; ఇంటికిన్ = తన నివాసమున; కిన్ = కి; చని = వెళ్ళి; ఆ = ఆ; రేయి = రాత్రి; గడపి = గడపి; మఱునాడు = మర్నాడు; ప్రొద్దునన్ = ఉదయమే; గ్రద్దనన్ = త్వరితముగ; తన = అతని; కున్ = కి; పరతంత్రులు = మిక్కిలి అనుకూలురు; అగు = ఐన; మంత్రులన్ = మంత్రులను; రావించి = పిలిపించి; యోగనిద్ర = యోగమాయ; వలనన్ = నుండి; తాన్ = అతను; వినిన = విన్నట్టి; వృత్తాంతంబు = వర్తమానము; అంతయున్ = అంతా; మంతనంబునన్ = ఏకాంతమున; ఎఱింగించినన్ = తెలుపగా; అపుడు = అప్పుడు; వారలు = వారు; అతని = అతని; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనిరి = చెప్పిరి.

భావము:- ఇలా ప్రసన్నులు అయిన దేవకీవసుదేవుల అనుమతి తీసుకుని, కంసుడు తన ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి ఎలాగో గడపి మరునాడు ఉదయాన్నే తన మంత్రులను పిలిపించాడు. దేవి యోగమాయ చెప్పిన విషయాలు అన్నీ వారికి చెప్పి సలహా అడిగాడు. వారు ఇలా అన్నారు.

10.1-164-క.

"ఇట్టయినఁ దడయ నేటికి?

పట్టణముల, మందలందుఁ, బల్లెల నెల్లన్

బుట్టెడి పెరిఁగెడి శిశువులఁ

బట్టి వధించెదము; మమ్ముఁ బంపు మధీశా!

టీక:- ఇట్టయినన్ = అలా అయితే; తడయన్ = ఆలస్యము చేయుట; ఏటికిన్ = ఎందుకు; పట్టణములన్ = పురములలోను; మందలు = గొల్లపల్లెలు; అందున్ = లోను; పల్లెలన్ = పల్లెటూళ్ళలోను; ఎల్లన్ = అన్నిచోట్లను; పుట్టెడి = పుట్టినట్టి; పెరిగెడి = పెరుగుతున్నట్టి; శిశువులన్ = చంటిపిల్లలను; పట్టి = పట్టుకొని; వధించెదము = చంపెదము; మమ్మున్ = మమ్ములను; పంపుము = పంపించుము; అధీశా = నాయకుడా, రాజా.

భావము:- "అలా అయితే ఇంకా ఆలస్యం దేనికి మహారాజా! పట్టణాలు, గొల్లపల్లెలు, గ్రామాలు అన్నిటిని వెదకి పసిపాపలు ఎక్కడ పుట్టినా పెరిగినా వధించి వస్తాము మమ్మల్ని ఆజ్ఞాపించండి

10.1-165-మ.

భవదీయోజ్జ్వల బాహుచాప విలసద్బాణావళీ భగ్నులై,

దివిజాధీశ్వరు లే క్రియంబడిరొ? యే దేశంబులం డాఁగిరో?

శివునిం జొచ్చిరొ? బ్రహ్మఁ జెందిరొ? హరిన్ సేవించిరో? మౌని వృ

త్తి వనాంతంబుల నిల్చిరో? మనకు శోధింపం దగున్ వల్లభా!

టీక:- భవదీయ = నీ యొక్క; ఉజ్జ్వల = ప్రకాశవంతమైన; బాహు = భుజబలం; చాప = ధనుస్సు నందు; విలసత్ = విలసిల్లెడి; బాణ = బాణముల; ఆవళీ = సమూహములచేత; భగ్నులు = ఓడిపోయినవారు; ఐ = అయ్యి; దివిజ = దేవతా; అధీశ్వరులు = ప్రభువులు; ఏక్రియన్ = ఎలా; పడిరో = పడిపోయారో; ఏ = ఏ; దేశంబులన్ = దేశములలో; డాగిరో = దాక్కొన్నారో; శివునిన్ = శంకరుని; చొచ్చిరొ = శరణువేడిరో; బ్రహ్మన్ = బ్రహ్మదేవుని; చెందిరొ = చేరిరో; హరిన్ = విష్ణుమూర్తిని; సేవించిరో = కొలిచిరో; మౌని = మునుల; వృత్తి = విధానమున; వనాంతంబులన్ = అడవులలో; నిల్చిరొ = వసించిరో; మన = మన; కున్ = కు; శోధింపన్ = వెతుకుట; తగున్ = యుక్తమైనపని; వల్లభా = రాజా.

భావము:- మహారాజా! భయంకరంగా ప్రకాశిస్తున్ననీ బాహువులతో ప్రయోగించిన బాణాల దెబ్బలు తిన్న దేవతాప్రభువులు ఏమైపోయారో? ఎక్కడ తలదాచుకున్నారో? శివుని ఆశ్రయించారేమో? లేక బ్రహ్మనో విష్ణువునో సేవిస్తున్నారేమో? అదీ కాకపోతే మునివృత్తులను స్వీకరించి నిరాశతో అరణ్యాలమధ్యలో ఉండిపోయారేమో? మనం వెదకడం మంచిది.

10.1-166-క.

నొచ్చిరి శాత్రవు లనుచును

విచ్చలవిడిఁ దిరుగ వలదు, వివిధాకృతులన్

మ్రుచ్చిలి వత్తురు; వారలు

సచ్చిన యందాఁక మఱవఁ జన దధిపునకున్.

టీక:- నొచ్చిరి = దెబ్బతిన్నారు; శాత్రవులు = వైరులు; అనుచునున్ = అనుకొనుచు; విచ్చలవిడిన్ = స్వేచ్ఛగా; తిరుగన్ = సంచరించుట; వలదు = పనికిరాదు; వివిధ = అనేక విధములైన; ఆకృతులన్ = రూపములలో; మ్రుచ్చిలి = మోసపుచ్చి; వత్తురు = వచ్చెదరు; వారలున్ = వారు; సచ్చిన = చచ్చిపోయే; అందాక = వరకు; మఱవన్ = ఉపేక్షించుట; చనదు = తగదు; అధిపున్ = రాజున; కున్ = కు.

భావము:- శత్రువులు దెబ్బతిన్నారు కదా! అనుకుని విచ్చలవిడిగా తిరగరాదు. వారు ఎన్నో రకాల వేషాలతో దొంగతనంగా రాగలరు. వారు చచ్చిపోయేటంతవరకు రాజైనవాడు వారిని మరచిపోరాదు.

10.1-167-క.

ఒత్తికొనుచు రానీఁజనఁ

దెత్తిన రోగముల, రిపుల, నింద్రియముల ను

త్పత్తి సమయములఁ జెఱుపక

మెత్తన గారాదు; రాదు మీఁద జయింపన్.

టీక:- ఒత్తికొనుచున్ = తోసుకొనుచు; రానీన్ = రానిచ్చుట; చనదు = తగదు; ఎత్తిన = విజృంభించిన; రోగములన్ = జబ్బులను; రిపులన్ = శత్రువులను; ఇంద్రియములనున్ = ఇంద్రియములను; ఉత్పత్తి = పుట్టెడి, అంకురించిన; సమయములన్ = అప్పుడే, సమయంలోనే; చెఱుపక = నశింపజేయకుండ; మెత్తనన్ = మెత్తబడుట, ఉపేక్షించుట; కారాదు = చేయరాదు; రాదు = వీలుకాదు; మీదన్ = ఆతరువాత; జయింపన్ =

లొంగదీసుకొనుటకు.

భావము:- విజృంభించిన రోగాలను, శత్రువులను, ఇంద్రియాలను అవి మనను ఆక్రమించేవరకు ఊరుకోరాదు. అవి పుట్టినప్పుడే త్రుంచివేయడంలో మెతకదనం చూపుట పనికిరాదు. ముదిరిన తరువాత జయించడం మన వల్ల కాదు.

10.1-168-మ.

అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం; డా చక్రి యేధర్మమం
దమరున్; గోవులు, భూమిదేవులు, దితిక్షామ్నాయ కారుణ్య స
త్యములున్, యాగ తపోదమంబులును, శ్రద్ధాశాంతులున్ విష్ణుదే
హము; లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్.

టీక:- అమర = దేవతల; శ్రేణి = సమూహముల; కిన్ = కి; ఎల్లన్ = అందరకు; చక్రి = విష్ణుమూర్తి {చక్రి - చక్రాయుధము కలవాడు, హరి}; ముఖరుండు = ముఖ్యమైనవాడు; ఆ = ఆ; చక్రి = విష్ణుమూర్తి; ఏ ధర్మంబున్ = ఏయే ధర్మముల; అందున్ = అందు; అమరున్ = ఒప్పి ఉండును; గోవులు = ఆవులు; భూమిదేవతలు = బ్రాహ్మణులు; తితిక్ష = క్షాంతి, ఓర్పు; ఆమ్నాయ = వేదములు; కారుణ్య = భూతదయ; సత్యములున్ = సత్యములు; యాగ = యజ్ఞములు; తపస్ = తపస్సులు; దమంబులును = ఇంద్రియ నిగ్రహములు; శ్రద్ధ = శ్రద్ధ; శాంతులున్ = నెమ్మది తనములు; విష్ణున్ = విష్ణుమూర్తి; దేహములు = స్వరూపములు; ఇన్నిటిన్ = ఇన్నిటిని; సంహరించినన్ = నాశనము చేసినచో; అతండున్ = అతడు; అంతంబున్ = నాశనమును; పొందెడిన్ = పొందగలడు.

భావము:- దేవతలు అందరకీ ఆ విష్ణువే ముఖ్యుడు. అతడు ధర్మము నందు నిలచి ఉంటాడు. విష్ణువును సంహరించాలంటే అతని శరీరం మనకి దొరకాలి. అది ఒక్కచోట దొరకదు. అతనికి ఎన్నోశరీరాలు ఉన్నాయి. గోవులు, బ్రాహ్మణులు, వేదములు, ఓరిమి, కారుణ్యము, సత్యము, యాగము, తపస్సు, దమము, శ్రద్ధ, శాంతి ఇవన్నీ విష్ణువు యొక్క శరీరాలే. వీటిని అన్నింటినీ అంతంచేస్తే అతడు కూడా నిలువనీడలేక నశించిపోతాడు.

10.1-169-వ.

కావున.

టీక:- కావునన్ = కనుక.

భావము:- మంచిని మట్టుపెడితే విష్ణువు నశించిపోతాడు కనుక . . .

10.1-170-ఉ.

చంపుదుమే నిలింపులను? జంకెల ఱంకెలఁ దాపసావళిం
బంపుదుమే కృతాంతకుని పాలికిఁ? గ్రేపులతోడ గోవులం
ద్రుంపుదుమే? ధరామరులఁ దోలుదుమే? నిగమంబులన్ విదా
రింపుదుమే? వసుంధర హరింపుదు మే? జననాథ! పంపుమా. "

టీక:- చంపుదుమే = వధించమంటావా; నిలింపులను = దేవతలను, బ్రహ్మవేత్తలని; జంకెలన్ = అదలించుటలతో; ఱంకెలన్ = బొబ్బలు అరుపులతో; తాపస = ఋషుల; ఆవళిన్ = సమూహములను; పంపుదుమే = పంపించమంటావా; కృతాంతకుని = యముని; పాలి = వద్ద; కిన్ = కి; క్రేపుల = దూడల; తోడన్ = తోపాటు; గోవులన్ = ఆవులను; త్రుంపుదుమే = నరకమంటావా; ధరామరులన్ = బ్రాహ్మణులను {ధరామరులు - ధర (భూమి)పై అమరులు (దేవతలు), విప్రులు}; తోలుదుమే = తరిమేయమంటావా; నిగమంబులన్ = వేదములను; విదారింపుదుమే = భేదించమంటావా; వసుంధరన్ = భూమిని; హరింపుదుమే = అపహరించమందువా; జననాథ = రాజా; పంపుమా = ఆజ్ఞాపింపుము.

భావము:- మహారాజా! దేవతలను చంప మంటావా? తపస్సు చేసుకునే మునులను భీకర గర్జనలతో యముని వద్దకు పంపేయ మంటావా? దూడలతో కూడా గోవులను నరికివేయ మని అంటావా? బ్రాహ్మణులను తరిమి తరిమి కొట్టమంటావా? లేక వేదాలను చింపివేయమంటావా? అదీకాకపోతే, భూమినే చుట్టచుట్టి తెచ్చి నీ వశంలో ఉంచమంటావా? ఏమి చేయమంటావో మమ్మల్ని ఆజ్ఞాపించు."

10.1-171-వ.

అని పలుకు మంత్రుల మంత్రంబుల నిమంత్రితుండై, బ్రాహ్మణ నిరోధంబు నిషిద్ధం

బని తలంపక కాలపాశబద్ధుండయి, విప్రాది సాధుమానవులఁ జంప దానవులం బంపి, యంతిపురంబునకుం జనియె; ననంతరంబ యా రక్కసులు వెక్కసంబు లగు మొక్కలంబుల సజ్జనుల పజ్జలం బడి, తర్జన గర్జన భర్జనాది దుర్జనత్వంబులం జేసి, నిర్జించి పాపంబు లార్జించిరి.

టీక:- అని = అని; పలుకు = బోధించెడి; మంత్రులన్ = మంత్రుల యొక్క; మంత్రంబులన్ = ఆలోచనలచేత; నిమంత్రితుండు = ప్రభావములో పడినవాడు; ఐ = అయ్యి; బ్రాహ్మణ = బ్రహ్మణులను; నిరోధంబున్ = అడ్డగించుట; నిషేధంబున్ = కూడనిపని; అని = అని; తలపక = ఎంచకుండ; కాల = కాలము అనెడి; పాశ = పాశములకు; బద్ధుండు = చిక్కినవాడు; అయి = ఐ; విప్ర = బ్రాహ్మణులు; ఆది = మున్నగు; సాధు = మంచి; మానవులన్ = వారిని; చంపన్ = సంహరించుటకు; దానవులన్ = రాక్షసులను; పంపి = నియమించి; అంతిపురంబున్ = అంతఃపురమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళిపోయెను; అనంతరంబ = ఆ తరువాత; ఆ = ఆ; రక్కసులు = రాక్షసులు; వెక్కసంబులు = సహింపరానివి; అగు = ఐన; మొక్కలంబులన్ = క్రూరవర్తనములచేత; సజ్జనుల = మంచివారి; పజ్జలంబడి = వెంటబడి; తర్జన = బెదిరించుటలు; గర్జన = అరుపులు; భర్జన =వేపుకుతినుట; ఆది = మున్నగు; దుర్జనత్వంబులన్ = దుష్టచేష్టలను; చేసి = చేసి; నిర్జించి = వధించి; పాపంబులున్ = పాపములను; ఆర్జించిరి = సంపాదించిరి.

భావము:- ఆ విధంగా మాట్లాడుతున్న మంత్రుల ఆలోచనలకు కంసుడు ప్రభావితం అయ్యాడు. బ్రాహ్మణులను బాధించడం తప్పు అని ఆలోచించ లేదు. కాలము అనేది అతని దుష్కర్మ రూపంలో యమపాశంవలె అతణ్ని బంధించి వేసింది. బ్రాహ్మణులు మొదలైన సాధుజనులను చంపడానికి తన అనుచరులైన రాక్షసులను పంపి తాను అంతఃపురానికి వెళ్ళిపోయాడు. అటు పిమ్మట రాక్షసులు భీకరంగా విజృంభించారు. సజ్జనుల వద్దకు చేరి భయపెట్టారు. దూషించారు. దండించారు. ఇలా అనేక దుర్మార్గాలతో వారిని బాధించి వేధించి ఎన్నో పాపాలు మూటగట్టుకున్నారు.

10.1-172-ఆ.

వెదకి వెదకి, దైత్యవీరులు సాధుల

నడఁప, వారి బలము లడఁగిపోయె;

యశము, సిరియు, ధర్మ, మాయువు, భద్రంబు,

నార్యహింసజేయ నడఁగుఁగాదె.

టీక:- వెదకివెదకి = బాగా వెతికి మరీ; దైత్య = రాక్షస; వీరులు = సైనికులు; సాధులన్ = సాధువులను; అడపన్ = అణచివేయుచుండగా; వారి = ఆ రాక్షసుల; బలములు = శక్తులు; అణగిపోయెన్ = క్షీణించిపోయినవి; యశమున్ = కీర్తి; సిరియున్ = సంపదలు; ధర్మమున్ = పుణ్యము; ఆయువు = ఆయుష్షు; భద్రంబున్ = మేలు; ఆర్య = ఉత్తములను; హింస = హింసించుట; చేయన్ = చేసినచో; అడగున్ = అణగిపోవును; కదె = కదా, నిజముగ.

భావము:- ఆవిధంగా ఆ దానవులు సజ్జనులను వెదకి వెదకి మరీ హింసపెడుతూ ఉంటే క్రమంగా వారిలోని అసలైన బల సామర్థ్యాలు నశించి పోయాయి. పూజ్యులను హింసిస్తే కీర్తి, ఐశ్వర్యం, ధర్మం, ఆయుర్దాయము, క్షేమము నశించిపోతాయి కదా.

## కృష్ణునికి జాతకర్మ చేయుట

10.1-173-వ.

అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి, మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, జలంబులాడి, శుచియై, శృంగారించుకొని, స్వస్తి పుణ్యాహవాచనంబులు చదివించి, జాతకర్మంబు జేయించి, పితృదేవతల నర్చించి, క్రేపులతోడఁగూడఁ గైజేసిన పాఁడిమొదవుల రెండులక్షలను, గనక కలశ మణి వసన విశాలంబులైన తిల శైలంబుల లేడింటిని భూదేవతల కిచ్చిన.

టీక:- అంతన్ = అప్పుడు; మంద = వ్రేపల్లె; లోన్ = అందు; నందుండు = నందుడు; నందనుండు = పుత్రుడు; పుట్టుట = జన్మించుట; ఎఱింగి = తెలిసికొని; మహా = గొప్ప; ఆనందంబునన్ = సంతోషముతో; నెఱవాదులు = మిక్కిలి విద్వాంసులు; అగు = ఐన; వేదవిదులన్ = వేదపండితులను; పిలిపించి = రావించి; జలంబులాడి = స్నానములు చేసి; శుచి = పరిశుద్ధుడు; ఐ = అయ్యి; శృంగారించుకొని = అలంకరించుకొని; స్వస్థిపుణ్యాహ వచనంబులు = అశుద్ధి నివారక కర్మము, మంగళార్థము మూడుమారులు చెప్పెడు శుభకర్మము (ఆంధ్రశబ్దరత్నా కరము, ఆంధ్రవాచస్పతము); చదివించి = పఠింపజేసి; జాతక్రమంబున్ = పుట్టినప్పుడు జేయుకర్మ {జాతకర్మము - వ్యు. జ్యాతే కర్మ, షోడశకర్మములలో శిశువు పుట్టినప్పుడు చేయు కర్మము}; చేయించి = చేయించి {షోడశ

కర్మములు - 1గర్భాదానము 2పుంసవనము 3సీమంతము 4జాతకర్మము 5నామకరణము 6అన్నప్రాసన 7చౌలము 8ఉపనయనము 9ప్రాజాపత్యము 10సౌమ్యము 11ఆగ్నేయము 12వైశ్వేదేవము 13గోదానము 14సమావర్తము 15వివాహము 16అంత్యకర్మము}; పితృదేవతలన్ = పితృదేవతలను {పితృదేవతలు – వసురుద్రాది రూపులైన అగ్నిష్వాత్తుడు కవ్యవాహనుడు మొదలైనవారు}; అర్చించి = పూజించి; క్రేపుల = దూడల; తోడన్ = తో; కూడన్ = పాటు; కైచేసిన = అలంకరించిన; పాడి = పాలిచ్చెడి; మొదవులన్ = ఆవులను; రెండులక్షలను = రెండులక్షలను (2,00,000); కనక = బంగారు; కలశ = కుండలచేతను; మణి = రత్నములచేతను; వసన = వస్త్రములచేతను; విశాలంబులు = విరివిగా చేయబడినవి; ఐన = అగు; తిల = నువ్వుల; శైలంబులన్ = పెద్ద కుప్పలను; ఏడింటిని = ఏడింటిని (7); భూదేవతల్ = విప్రుల; కిన్ = కు; ఇచ్చినన్ = దానముచేయగా.

భావము:- ఇది ఇలా ఉండగా అక్కడ వ్రేపల్లెలో నందుడు తనకు కొడుకు పుట్టాడని విని, మహానందం పొందాడు. వేదపండితులు అయిన బ్రాహ్మణులను పిలిపించాడు. తాను శుచిగా స్నానాలు చేసి, అలంకరించుకున్నాడు. బ్రాహ్మణుల చేత స్వస్తివాచకాలు శుభాశీస్సులు పుణ్యాహవచనాలు చేయించాడు. బాలుడికి శుభకర్మలు చేయించాడు. పితృదేవతలకు తృప్తిగా పూజలు చేసాడు. రెండు లక్షల (2,00,000) పాడిఆవులను ఆభరణాలతో అలంకరించి దూడలతో సహా బ్రాహ్మణులకు దానాలు చేసాడు. పెద్ద పెద్ద నువ్వుల రాసులు ఏడింటితో (7) పాటు బంగారు చెంబులు, రత్నాభరణాలు, నూతన వస్త్రాలు దానం చేసాడు.

10.1-174-క.

"ఈ యాభీరకుమారుఁడు
శ్రీయుతుడై, వీర వైరిజేతయునై, దీ
ర్ఘాయుష్మంతుం డగు"నని
పాయక దీవించి రపుడు బ్రాహ్మణ జనముల్.

టీక:- ఈ = ఈ; ఆభీర = గొల్ల; కుమారుడు = పిల్లవాడు; శ్రీ = సంపదలతో; యుతుడు = కూడినవాడు; ఐ = అయ్యి; వీర = శూరులైన; వైరి = శత్రువులను; జేతయున్ = జయించినవాడు; ఐ = అయ్యి; దీర్ఘ = ఎక్కువ; ఆయుష్మంతుడు = ఆయుష్షు కలవాడు; అగును = అగుగాక; అని = అని; పాయక = తప్పక; దీవించిరి = ఆశీర్వదించిరి; అపుడు = అప్పుడు; బ్రాహ్మణ = విప్రులైన; జనముల్ = వారు.

భావము:- బ్రాహ్మణులు అందరూ "ఈ నందగోపకుమారుడు సమస్త సంపదలతో; తులతూగగలడు; శత్రు వీరులను జయించగలడు; దీర్ఘాయుష్మంతుడు కాగలడు." అని గట్టిగా దీవించారు.

10.1-175-క.

దుందుభులు మొరసె; గాయక

సందోహము పాడె; సూతసముదాయముతో

వందిజనులు కీర్తించిరి;

క్రందుగ వీతెంచె భద్రకాహళ రవముల్.

టీక:- దుందుభులు = నగరాలు, భేరీలు; మొరసెన్ = మోగినవి; గాయక = గానములు చేసెడివారి; సందోహము = సమూహము; పాడెన్ = ఆలపించెను; సూత = పొగడువారి; సముదాయము = సమూహముల; తోన్ = తోటి; వందిజనులు = స్తుతించువారు; కీర్తించిరి = స్తోత్రములు చేసిరి; క్రందుగన్ = సందడిగా; వీతెంచెన్ = వినబడెను; భద్ర = మంగళకరములైన; కాహళ = పెద్ద బాకాల; రవముల్ = ధ్వనులు.

భావము:- ఆ వ్రేపల్లెలో దుందుభులు మ్రోగించారు. గాయకులు ఆనందంతో పాటలు పాడారు. సూతులు వందిజనులు స్తోత్రాలతో కీర్తించారు. భద్రంకరములు అయిన బాకాల మోతలు చెవుల కింపుగా వినిపించాయి.

10.1-176-క.

పల్లవ తోరణసురుచిర

వల్లీధ్వజరాజిధూపవాసనములతో,

సల్లలితములై యొప్పెను

వల్లవవల్లభుల యిండ్ల వాకిండ్లెల్లన్

టీక:- పల్లవ = చిగురుటాకుల; తోరణ = వరుసలు కట్టినవానితోను; సురుచిర = చక్కనైన; వల్లీ = తీగలు గల; ధ్వజ = జండాల; రాజి = సమూహములతోను; ధూప = సాంబ్రాణి మున్నగువాని; వాసనముల = సువాసనల; తోన్ = తోటి; సల్లలితములు = మిక్కిలి మనోజ్ఞమైనవి; ఐ = అయ్యి; ఒప్పెన్ = చక్కగా ఉండెను; వల్లవ = గొల్లల, యాదవుల; వల్లభులు = శ్రేష్ఠుల; ఇండ్ల = నివాసముల; వాకిండ్లు = వాకిళ్ళు; ఎల్లన్ = అన్నియును.

భావము:- గొల్లనాయకుల ఇండ్లువాకిళ్ళు చిగురుటాకుల తోరణాలతో మనోహరములైన తీగలతో గొప్ప కేతనములతో ధూపముల పరిమళములతో ఇంపుగొల్పుతున్నవి.

10.1-177-క.

పసుపులు నూనెలు నలఁదిన

పసఁ దనరి, సువర్ణ బర్హి బర్హ ప్రభతోఁ

బసిమి గలిగి, వెలుగొందుచుఁ,

బసు లన్నియుఁ మందలందుఁ బ్రసరించె, నృపా!

టీక:- పసువులు = పసుపు కుంకుమ గంధములు; నూనెలు = చమురులు; అలదిన = రాసినట్టి; పసన్ = చాతుర్యముచేత; తనరి = అతిశయించి; సువర్ణ = బంగారపు; బర్హి = నెమళ్ళ; బర్హ = పింఛముల; ప్రభ = కాంతుల; తోన్ = తోటి; బసిమిన్ = నవకము, అందము; కలిగి = కలవై; వెలుగొందుచున్ = ప్రకాశించుచు; పసులు = ఆవులు; అన్నియున్ = ఎల్లను; మందలు = గొల్లపల్లెల; అందున్ = లో; ప్రసరించెన్ = మెలగెను; నృపా = రాజా.

భావము:- గోపకులు అందరూ తమ పశువుల శరీరాలకు పసుపు నూనె కలిపి పట్టించారు. ఆ పశువులు బంగారురంగు నెమలిపింఛముల లాగ పచ్చని పసిమిరంగుతో వెలుగొందుతూ మందలలో చిందులు వేశాయి.

10.1-178-క.

క్రేళ్ళుఱికి మసలె లేఁగలు;

మల్లడిగొని ఱంకె లిడియె మదవృషభంబుల్;

పెల్లుగ మొదవులు పాదుఁగుల

జల్లించెం బాలు, బాలుసంభవవేళన్

టీక:- క్రేళ్ళు = చెంగుమని; ఉఱికి = దూకుచూ; మసలెన్ = మెలగెను; లేగలు = లేగదూడలు; మల్లడిగొని = మత్తెక్కి; ఱంకెలు = రంకెలు (ఎద్దు అరుపు); ఇడియెన్ = వేసినవి; మద = మదించిన; వృషభంబులు = ఎద్దులు; పెల్లుగన్ = అధికముగా; మొదవులు = ఆవులు; పాదుగులన్ = పొదుగులనుండి; జల్లించెన్ = కురిపించెను; పాలు = క్షీరములను, పాలను; బాలు = బాలకృష్ణుని; సంభవ = జన్మించిన; వేళన్ = సమయమునందు.

భావము:- బాలుడు కలిగిన సమయంలో ఆ మందలలోని లేగదూడలు చెంగున గంతులు వేశాయి. పోతరించిన వృషభాలు ఉత్సాహంతో ఖణిల్లు మని ఱంకెలు వేశాయి. ఆవులు పుష్కలంగా పాలు వర్షించాయి.

10.1-179-క.

ఆరఁగఁ జదివెడి పొగడెడి
వారికి, విద్యలను బ్రతుకువారికి, లేమిం
జేరిన వారికి నెల్లను
గోరక మును నందు డిచ్చె గోధనచయముల్.

టీక:- ఆరగన్ = నిండుగా; చదివెడి = పఠించెడి; పొగడెడి = స్తుతించెడి; వారి = వారల; కిన్ = కు; విద్యలను = విద్యలు చూపుట ద్వారా; బ్రతుకు = జీవికసాగించెడి; వారి = వారల; కిన్ = కు; లేమిన్ = పేదరికమువలన; చేరిన = ఆశ్రయించిన; వారి = వారల; కిన్ = కు; ఎల్లను = అందరకు; కోరక = అడుగక; ముందే = ముందుగనే; నందుడు = నందుడు; ఇచ్చెన్ = దానము చేసెను; గో = ఆవుల; ధన = ధనముల; చయముల్ = సమూహములను.

భావము:- నందుడు ఆ సమయంలో తృప్తిగా దానాలు చేసాడు. ప్రతిదినమూ వచ్చి పుణ్యకథలు వినిపించే బ్రాహ్మణులకూ, స్తోత్రపాఠాలుచేసే వందిగాయకులకూ, గారడీలు ఇంద్రజాలాలు పగటివేషాలు మొదలైన విద్యలపై బ్రతికేవారికి, దారిద్ర్యంతో బాధపడుతూ దరిచేరినవారికి, అందరికి వారు అడగక ముందే గోవులను ధనాన్ని కొల్లలుగా దానం చేసాడు.

10.1-180-వ.

ఆ సమయంబున.

టీక:- ఆ = ఆ; సమయంబునన్ = సమయమునందు.

భావము:- ఆనాడు . . . .

10.1-181-క.

కంచుకములు, తలచుట్లును,
గాంచన భూషాంబరములుఁ, గడు మెఱయఁగ నే
తెంచిరి, గోపకు లందఱు
మంచి పదార్థములు గొనుచు మాధవుఁ జూడన్.

టీక:– కంచుకములు = చొక్కాలు, అంగీలు, అవికెలు; తలచుట్లును = తలపాగాలు; కాంచన = బంగారు; భూష = ఆభరణములు; అంబరములు = వస్త్రములు; కడు = మిక్కిలి; మెఱయగన్ = ప్రకాశించుచుండగా; ఏతెంచిరి = వచ్చిరి; గోపకులు = గొల్లలు; అందఱున్ = ఎల్లరు; మంచి = మేలైన; పదార్థములున్ = వస్తువులను; కొనుచు = తీసుకొని వచ్చి; మాధవున్ = శ్రీకృష్ణుని {మాధవుడు - మాధవి భర్త, కృష్ణుడు}; చూడన్ = చూచుటకు.

భావము:– గోపకులందరూ నందుని నందనుణ్ణి చూడడానికి బయలుదేరారు; అందరూ అంగీలు తొడుక్కున్నారు; తలపాగాలు చుట్టుకున్నారు; బంగారు అభరణాలు, అందమైన దుస్తులు ధరించారు; అందరూ శుభకరములైన పదార్థాలు తీసుకుని నందుని ఇంటికి వచ్చారు; ఆ పుట్టిన వాడు లక్ష్మీదేవికి భర్త కనుక అందరూ సంపదలతో తులతూగుతూ వచ్చారు.

10.1-182-క.

ఏతెంచి, చూచి చెలఁగుచు

నేతులఁ, బెరుఁగులను, బాల, నీళ్ళను, వెన్నం

బ్రీతి వసంతము లాడిరి

యేతరులై, సరసభాష లెసగన్ గొల్లల్.

టీక:– ఏతెంచి = వచ్చి; చూచి = చూసి; చెలగుచున్ = చెలరేగుచు; నేతులన్ = నేతితోను; పెరుగులనున్ = పెరుగుతోను; పాలన్ = పాలతోను; నీళ్ళనున్ = నీళ్ళతోను; వెన్నన్ = వెన్నతోను; ప్రీతిన్ = ఇష్టముగా; వసంతములు = ఒకరిపై నొకరు జల్లుకొనుట, వసంతోత్సవములు; ఆడిరి = ఆటలు ఆడిరి; ఏతరులు = తుళ్ళుతున్నవారు; ఐ = అయ్యి; సరస = సరసపు; భాషలు = మాటలు; ఎసగన్= విజృంభించగా; గొల్లలు = యాదవులు.

భావము:– అలావచ్చి ఆ బాలుని చూసి గోపకులు అందరూ ఆనందముతో పొంగిపోతున్నారు; ఉత్సాహంతో చెలరేగి నేతులను పెరుగులను పాలను నీళ్ళను వెన్నను ఒకరిపై ఒకరు చిమ్ముకుంటూ ఛలోక్తులు విసురుకుంటూ వసంతోత్సవం జరుపుకున్నారు.

10.1-183-వ.

తదనంతరంబ.

టీక:- తదనంతరంబ = ఆ తరువాత.

భావము:- అలా బాలుని చూసి ఆనందంతో పండుగ చేసుకున్న పిమ్మట.

10.1-184-ఆ.

"ఏమినోము ఫలమొ? యింత ప్రొ ద్దొక వార్త
వింటి మబలలార! వీను లలర;
మన యశోద, చిన్నిమగవానిఁ గనె నట
చూచి వత్త మమ్మ! సుదతులార! "

టీక:- ఏమి = ఎట్టి; నోము = వ్రతములు నోచిన; ఫలమొ = ఫలితముగనో; ఇంతప్రొద్దు = ఇప్పటికి; ఒక = ఒకానొక; వార్తన్ = శుభ వర్తమానమును; వింటిమి = విన్నాము; అబలలార = ఇంతులూ {అబల - బలము తక్కుగా ఉండునామె, స్త్రీ}; వీనులు = చెవులు; అలరన్ = ఆనందించగా; మన = మన యొక్క; యశోద = యశోద; చిన్ని = చంటి; మగవాని = మగపిల్లవాడిని; కనెను = ప్రసవించెను; అటన్ = అట; చూచి = చూసి; వత్తము = వచ్చెదము; అమ్మ = అమ్మ; సుదతులార = సుందరీమణులారా {సుదతి - మంచి పలువరుస కలామె, అందగత్తె}.

భావము:- "ఓ సుందరమైన చెలులారా! ప్రొద్దునే లేస్తూనే ఇంత మంచి శుభవార్త చెవులార విన్నాం, ఏనాడు నోచిన నోముల ఫలితమో గానీ; మన యశోదమ్మ చిన్న పాపడిని కన్నదట. చూసి వద్దాం సుందరీమణులు! రండి రండి"

10.1-185-వ.

అని యొండొరుల లేపికొని, గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తిన తత్తఱంబు లొత్తుకొన, నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి.

టీక:- అని = అని; ఒండొరులన్ = ఒకరినొకరు; లేపికొని = బయలుదేరదీసికొనుచు; గోపికలు = గొల్లస్త్రీలు; ఓపికలు = తాలుములు, ఓర్పులు; లేని = లేనట్టి; చిత్తంబులన్ = మనసులతో; ఎత్తిన = కలిగిన; తత్తఱంబులు = తొట్రుబాటులు; ఒత్తుకొనన్ = కమ్ముకొనగా; ఉదారంబులు = విరివియైనవి; అగు = ఐన; శృంగారంబుల =

అలంకారముల; తోన్ = తోటి; ఇండ్లు = తమ నివాసములనుండి; వెలువడి = బయలుదేరి.

భావము:- ఆ గోపికలు సహజంగానే సున్నితహృదయాలు గలవారు. ఈవార్త వినేసరికి తొందర ఎక్కువైంది. అపూర్వంగా అలంకారాలు చేసుకుని ఒకరి నొకరు లేవండి లేవండి అని చెప్పుకుంటూ ఇళ్ళనుండి బయలుదేరారు.

10.1-186-క.

జడగతులును, బలుపిఱుదులుఁ,

బిడికెడు నడుములును, వలుఁద బిగి చనుఁగవలున్,

వెడఁద నయనములు, సిరి తడఁ

బడు మోములు, భ్రమర చికుర భరములు, నమరన్.

టీక:- జడగతులునున్ = మెల్లని నడకలు, జడల సొంపులు; పలు = పెద్ద; పిఱుదులున్ = పిఱ్ఱలు; పిడికెడు = పిడికిట్లో సరిపడు సన్నని; నడుములునున్ = నడుములు; వలుద = లావైన; బిగి = గట్టి, బిగువైన; చను = స్తనముల; కవలున్ = జంటలు; వెడద = వెడల్పైన; నయనములున్ = కళ్ళు; సిరి = సౌభాగ్యములు, లక్ష్మీకళలు; తడబడు = మెదలెడి, తడబడెడి; మోములున్ = ముఖములు; భ్రమర = తుమ్మెదలవంటి; చికుర = శిరోజములు; భరములున్ = విరివైనవి, అధికమైనవి; అమరన్ = అమరి ఉండగా.

భావము:- అందరికి త్వరగానే వెళ్ళాలి అని ఉన్నది కాని, విశాలమైన పిరుదులు; పొంకమైన వక్షోజాలు; పిడికిట్లో ఇమిడేటంత సన్నని నడుము; ఇంకెలా త్వరగా నడువగలరు. నెమ్మదిగా నడకలు సాగుతున్నాయి. కన్నులు మాత్రం ఆనందంతో విశాలంగా విచ్చుకున్నాయి. పెద్ద తుమ్మెద రెక్కలవలె నల్లనైన పెద్దతల కొప్పులు చక్కగా ఊగుతున్నాయి. లక్ష్మీకళలు కూడా ఆ గోపికల మోముల అందాల ముందు తడబడుతున్నాయి.

10.1-187-ఉ.

వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ, గుచోపరి హారరేఖ ల

ల్లాడఁ, గపోలపాలికల హాటకపత్రరుచుల్ వినోదనం

బాడఁ, బటాంచలంబు లసియాడఁగఁ, జేరి, యశోద యింటికిన్

జేడియ లేగి, చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్నికృష్ణునిన్.

టీక:- వేడుకన్ = సరదాగా వేసిన; క్రొత్త = సరికొత్త; ముడులు = కొప్పులు; వీడన్ = సడలుతుండగా; కుచ = స్తనముల; ఉపరి = మీది; హార = హారముల; రేఖలు = వరుసలు; అల్లాడన్ = చలించుచుండగా; కపోలపాలికలన్ = చెంపల ప్రదేశము నందు; హాటక = బంగారు; పత్ర = పత్రముల; రుచుల్ = కాంతులు; వినోదనంబున్ = వేడుకగా; ఆడన్ = కదులుతుండగా; పటాంచలంబులు = పైటకొంగులు; అసియాడగన్ = వేళ్ళాడగా; చేరి = కూడి; యశోద = యశోద యొక్క; ఇంటి = నివాసమున; కిన్ = కు; చేడియలు = పడతులు; ఏగి = వెళ్ళి; చూచిరి = చూసిరి; ఒగిన్ = ఒక్కసారిగా, చక్కగా, వరుసగా; జిష్ణుని = శ్రీకృష్ణుని {జిష్ణుడు - జయించెడి శీలము కలవాడు, విష్ణువు}; విష్ణుని = శ్రీకృష్ణుని {విష్ణువు - సర్వవ్యాపకుడు, హరి}; చిన్నికృష్ణునిన్ = బాలకృష్ణుని.

భావము:- ఆతురతలు పెరిగిపోతుండటంతో అంతకంతకు పెరుగుతున్న గోపికల నడక వేగాలు నందుని ఇంటికి చేరేసరికి దాదాపు పరుగును అందుకున్నాయి. అప్పుడే వేసుకుని వచ్చిన జడముడులు విడిపోయాయి; వక్షస్థలంపైన ఉన్నహారాలు అల్లల్లాడిపోయాయి; బంగారు కర్ణపత్రాల కాంతులు వారి చెక్కిళ్ళపై కదులుతున్నాయి; పైట కొంగులు గాలిలో ఒయ్యారంగా నాట్యాలు చేసాయి; ఆవిధంగా ఆ గోపికలు యశోద ఇంటికి చేరి, ఎంతో ఉత్సాహంతో చిన్ని కృష్ణుడిని చూసారు. అతడు సకల జయశీలుడు, దానవులనే కాదు వారి హృదయాలను కూడా జయింపబోతున్న వాడు అయిన విష్ణువు కదా.

10.1-188-వ.

చూచి సంతసించి, తెచ్చిన కానుక లిచ్చి.

టీక:- చూచి = చూసి; సంతసించి = సంతోషించి; తెచ్చిన = తీసుకొని వచ్చిన; కానుకలు = బహుమానములను; ఇచ్చి = సమర్పించి.

భావము:- గోపికలు చిన్నికృష్ణుని చూసి ఎంతో సంతోషించారు. తాము తెచ్చిన కానుకలు ఇచ్చారు.

# పూర్ణి

*10.1-1791-మాలి.*

*సరసిజనిభ హస్తా! సర్వలోక ప్రశస్తా!*
*నిరుపమ శుభమూర్తీ! నిర్మలారూఢ కీర్తీ!*
*పరహృదయ విదారీ! భక్తలోకోపకారీ!*
*గురు బుధజన తోషీ! ఘోరదైతేయ శోషీ!.*

*టీక:- సరసిజనిభహస్తా = శ్రీరామా {సరసిజనిభహస్తుడు - సరసిజ (పద్మము) నిభ (వంటి) హస్తుడు (అరచేతులు కలవాడు), శ్రీరాముడు}; సర్వలోకప్రశస్తా = శ్రీరామా {సర్వలోకప్రశస్తుడు - సర్వ (సమస్తమైన) లోక (లోకములలోను) ప్రశస్తుడు (శ్లాఘింపబడువాడు), శ్రీరాముడు}; నిరుపమశుభమూర్తీ = శ్రీరామా {నిరుపమశుభమూర్తి - నిరుపమ (సాటిలేని) శుభ (మేళ్ళు కలిగించెడి) మూర్తి (ఆకృతి కలవాడు), శ్రీరాముడు}; నిర్మలారూఢకీర్తీ = శ్రీరామా {నిర్మలారూఢకీర్తి - నిర్మల (పరిశుద్ధమైన) ఆరూఢ (నిలకడైన) కీర్తి (కీర్తి కలవాడు), శ్రీరాముడు}; పరహృదయవిదారీ = శ్రీరామా {పరహృదయవిదారి - పర (విరోధుల) హృదయ (గుండెలను) విదారి (చీల్చెడి వాడు), శ్రీరాముడు}; భక్తలోకోపకారీ = శ్రీరామా {భక్తలోకోపకారి - భక్తులను లోక (ఎల్లరకు) ఉపకారి (ఉపకారము చేయువాడు), శ్రీరాముడు}; గురుబుధజనతోషీ = శ్రీరామా {గురుబుధజనతోషి - గురు (గొప్ప) బుధ (జ్ఞానము కల) జన (వారికి) తోషి (సంతోషము కలిగించు వాడు), శ్రీరాముడు}; ఘోరదైతేయశోషీ = శ్రీరామా {ఘోరదైతేయశోషి - ఘోర (క్రూరమైన) దైతేయ (రాక్షసులను) శోషి (నశింపజేయు వాడు), శ్రీరాముడు}.*

*భావము:- పద్మాల వంటి హస్తములు కలవాడా! ఎల్లలోకాలలోను శ్రేష్ఠతమమైన వాడా! సాటిలేని మంగళ స్వరూపము కలవాడా! స్వచ్ఛమైన వన్నెకెక్కిన కీర్తి కలవాడా! శత్రువుల గుండెలను ఖండించు వాడా! భక్త సమూహానికి మేలు చేయువాడా! పెద్దలను, పండితులను సంతోషపరచేవాడా! భయంకరులైన రక్కసులను నాశనము చేయువాడా! శ్రీరామచంద్రప్రభూ! వందనములు.*

## ఉపాఖ్యానంత గద్యము.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహాభాగతం బను మహాపురాణ దశమ స్కంధం బందంలి రోహిణి బలభద్రుని కనుట, బ్రహ్మాదుల స్తుతి, దేవకి కృష్ణుని కనుట, వసుదేవుడు కృష్ణుని పొగడుట, దేవకి చేసిన స్తుతి, దేవకీ వసుదేవుల పూర్వజన్మ, కృష్ణుడు శిశురూపి యగుట, కృష్ణుని వ్రేపల్లెకు తరలించుట, శయ్యన నుంచుట, దేవకి బిడ్డను విడువ వేడుట, మాయ మింటనుండి పలుకుట, కంసునికి మంత్రుల సలహా, కృష్ణునికి జాతకర్మచేయుట అను కథలు గల శ్రీకృష్ణులవారు అవతరించుట అనెడి ఉపాఖ్యానం సుసంపూర్ణం అగుట.

*ఓం నమో భగవతే వాసుదేవాయ॥*

*ఓం। ఓం। ఓం।*

*ఓం। శాంతిః। శాంతిః। శాంతిః।*

*సర్వే జనా స్సుఖినో భవతు॥*

## విష్ణుమూర్తి ఆయుధములు

శంఖము పాంచజన్యము

చక్రము సుదర్శనము / సునాభము

గద కౌమోదకి

ధనుస్సు శార్ఙ్గము

ఖడ్గము నందకము

డాలు చర్మము

రథము / తేరు శతానందము

వాహనము గరుత్మంతుడు

సేనానాయకుడు విష్వక్సేనుడు

సారథి దారకుడు

గుఱ్ఱములు 1సైబ్య 2సుగ్రీవ 3పుష్ప 4వలాహకములు

## షోడశవికారములు

షోడశవికారములు = ఏకాదశేంద్రియములు 11 [పంచ జ్ఞానేంద్రియములు (కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మము), పంచ కర్మేంద్రియములు (కాళ్ళు, చేతులు, వాక్కు, గుదము, గుహ్యేంద్రియము), బుద్ధి] మరియు పంచ భూతములు 5 (భూమి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము)

– – – – మరొక విధము – – –

షోడశవికారములు = పంచప్రాణములు (5) అంతఃకరణ (1) జ్ఞానేంద్రియములు (5) కర్మేంద్రియములు (5)

షోడశమనోవికారములు= 1 కామము 2 క్రోధము 3 లోభము 4 మోహము 5 మదము 6 మాత్సర్యము 7 రాగము 8 ద్వేషము 9 ఈర్ష్య 10 అసూయ 11 దర్పము 12 దంభము 13 భయము 14 అహంకారము 15 స్వప్నము 16 భ్రాంతి అనే పదహారు మనోవికారాలు.